శ్రీరస్తు.



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీ వేంకటేశ్వర పద్మావతి పరిణయనాటకం.

క॥ శ్రీనాథా కేశవహరి నానావిధ దివ్యరూప నళినదళాక్షా । పూని నిను మదినిదలచుచు యీ నాటక మిప్పుడు జేతునింపునవినుమా॥

గీ॥ వెంకటేశుడవై నీవు వేడ్క శేష గిరియు జేరియు యాకాశ నరవరేణ్యు। ముద్దుకూతురి పెండ్లాడి మోదమంది నట్టిచరితంబు జెప్పెద నబ్జనేత్రా ॥

క॥ పరిపరివిధముల నిన్నే మరువక నా మదిని దలతు మమతను వినుమో పరమపురుషేను కోరినవర మొసగియు బ్రోవుమయ్యా వనరుహనేత్రా ॥

గీ॥ యతియో ప్రాసమొగణమొ । క్షితిపై నా కెరుక లేక చిత్తములోనన్ । అతిమోదము నినుదలచెద యతిప్రాసగణంబులన్ని యటుబల్కించన్ ॥

వ॥ అని యిష్టదేవతను ధ్యానించి ॥

## గణపతిప్రార్థన.

క॥ రణవీరభుజగముక్తా । మణిహారమహాహ్లాదకేశు । హైమ
శిపుత్రా గణనాథవేదపారాయణ దుష్టగణంబులన్ని నణగించు మికర్తా॥

## సరస్వతి ప్రార్థన.

క॥ వాణీ నినుదలచెదనజు । రాణీ సకలోర్వి దేవిరాగీర్వాణీ
వీణాధరి పల్లవసుమ । పాణీశరణంబునీదు పాదముల కిర్తా ॥

## అంబాప్రార్థన-దరువు-ఆదితాళం.

అంబాపరాదేవి ॥ అంబా శశిముఖబింబా హేజగదాంబా నిను
నే మనంబున దలచెద ॥ దే ॥ రావే ననుచేకోవే నా వరమీవే నాగతి
నీవేదంబా ॥ అం ॥ నిన్నే నమ్మితీ నీరజనేత్రి కన్నడశేయక కరుణను
బ్రోవవె ॥ అం ॥ సరగున నేలవెసారసనేత్రిరో తిరుపతి పురనరహారిసుత
సుందరి ॥ అం ॥

సీ॥ శ్రీరామచంద్రుల చిత్తంబునందుంచి । విఘ్నరాజును
చాలవినుతిజేసి । బ్రహ్మరాణిని నాదు జింహ్వావాసినిజేశి ఆహోయ
గ్రీవుని అధికముగను। గొనియాడి ఘనముగా గొబ్బునసురలకు వందనం
బులు జేశి వాల్మికాది । శుకశౌనకులనెల్ల సుస్థిరంబున దలచి కాళి
దాసాభీమకవుల బొగడి । భావమందున నరశింగు భానుగురువు।లకును
వందనములు జేశి లాలితముగ చరణములునొత్తి వారి సత్కారుణతోడ
జేతు యీనాటకంబు ప్రఖ్యాతిమెరయా ॥

క॥ కొలతుగ రాములసన్నధి నిలతుగ యా రాము నెపుడు
నిశ్చల మతితోగ దలతుగ నాదుమనంబున వలతుగ యా రామ
చంద్రు వనరుహానేత్రుగ ॥

వ॥ యిట్లున్నసమయంబున.

సీ॥ శ్రీకరంబుగ దేవశిశ్రూష జేయుచు తిరుపతిపురియందు
యరుదుగాను సిరులొల్క జగన్నాదసింగు సుపుత్రుడా తులశీరాం
శింగు తా ఘనతకెక్క ధైర్యశౌర్యంబుల తక్కకదనరుచు నొకనాడు

నసుబిలచి వరుసతోడ కన్నయ్యాకవివరా కలుషంబులణచేటి శ్రీ వెంక టేశ్వరచరితమందు। వెలయుపద్మావతీసతికి వేడ్క-పరిణయంబు నవర సాలంకారాంబుగాను। జెప్ప మనగను నేనుబల్ మెప్పగాను నాట కంబుగ జెప్పితి తేటపడగ॥

గీ॥ వాసిమీరగ తిరుపతి కాశిరాముల లాలకొమరుండ కన్నయ్యా లాలనంగ యలమిపద్మావతిపరణయంబు నాటకంబు రీతిని జేతు నిక్కంబుగాను॥

గీ॥ భారతీదేవిచే కడుభవ్యమునను కోరినటువంటివరముచే కొన్నవాడ దేవి బల్కించురీతిని తెనుగుగాను జెప్పవాడను నా యందు తప్పలేదూ॥

వ॥ మరియు.

చ॥ యిద్దరు వనముకేగి। మరి యిద్దరి కబయము లిచ్చి యా వల యిద్దరి పారవైచి మరి యిద్దరి నేలనుగూల్చి మరియు తా మి ద్దరు పురముచేరి మరి యిద్దరి జూచియు సంతసించి నా యిద్దరిచేత శే వగొను యినకులచంద్రుడౌ రామచంద్రుడు॥

వ॥ అంకితంబుగా నే నొనర్పంబూనిన శ్రీవెంకటేశ్వర మహా త్యంబునందు పద్మావతిపరణయం బనునాటకంబునకు కథాక్రమం బ్లైలనినా॥

కథ దెలుపు-ద్విపదసావేరి.

వినుడి - రుషులంత - తా వేడుకలలర- మనమున - తలపోశి - ఘనమైనదేవ చేవుడెవ్వండని- తేజంబుమీర-భావింపబృగుడంత - పరికిం చిచాల - వెంకటేశుడటంచు - విన్నవించుటయు - పొంకముగా - నట్లు పొందుపడంగ - జేయనాజ్ఞాపింపజేరె - త్రిమూర్తు - లాయనపరికింప - నజుడు - శివుండు - నారాయణులలోన - నరయ కేశవుని - ధీరతమీరగ దివ్యదేహమున - తన్నిన - లక్ష్మితాతహాతహాపడుచు - తిన్నగాహరి బాసి తెగవమీరంగ కొల్లాపురంబునకోరి - జేరుటయు - మెల్లగా - రుష లకునెల్లబృగుండు - దెల్పుట - హరితనదేవికై - వగచి - అల్పుని -

కై వడినపుడువల్మీక - మందునజేరి - మరి శిరిగొల్ల - మందయానగ చోళమహీపాలు జేరి-శివుని గోవుగ బ్రహ్మచినదూడగాను - సవినయం బున - నమ్ము చందానజేశి - అచ్చ టచ్చట-యమ్మగా మప్మ మరశి- హెచ్చుగా మరి యామహీపాలుకమ్మ - నంత టారాజు మన్ననతోడ గోప - కాంతుని కొప్పింపగా నతడు మేపు - నది వెంకటాద్రిని యటు మేయునపుడు - వదలకహరియుండు వల్మీకమునను - జేరి హరికిని పాలు చెన్నొందనివ్వ - పరికింప నొకనాడు పాలు లేకున్న-చోళభూపతి యట్టె చురచురక జూచి - పాలు లేవనుచు గోపాలునిదూర- నంతగోవుకు గోవు నటుదోలనదియు - వింతగా కడువేగ వెంకటాద్రికిని - జేరి మునురీతిని జేయతాగనియు - ఫ్రారిపాపి యటంచు వరుసతో హరియు దూరుచు గొడ్డలితో వైచి తాను-ధరణిపై గూలిన ధరణీశు డెరిగి - కరమర్థిజూచిన కమలాక్షిశాప - మిడుటయునటె తాను మేదిని జనియె- వడిగాను మరి హరివగచుచునంత - నా వరాహునికిని నయమొప్పదెలుప - యావన జాక్షు నీకావకుళమాల- కెనుపరిచారంబు పనులకంపింప - ఘనముగా నుండె తా ఘను డొకనాడు - వేటాడ జనిచని వేట్క-తోకలభ-మేటాడు చునుతరుమమేదిని పరుగు- లెత్తిన చిక్క-క విస్మయం బొంది- తత్తరం బున నొక్క-తరువులున్న వనము - జేరగా తనతోటి చెలులుతగ గొలువ- నొకసతి గననంతవడిమీరరాళ్లు-నకలంక మతిరువ్వ నాదెబ్బ తగుల-తాళ క మరిహరి తాళక వకుళ-మాలిక కనుదెల్ప- నయము గావించుట నర సుడా హరియు సుందరమా యదుక సుదతియు నగుచు - ధరణిదేవికి చాల తనసుతతెరగు - మెరుగ జెప్పగ నామె నట్లగుగాక - యనియు పద్మావతియలివేణినిచ్చి - గనునకు పణతియుగాజేయమరియు-- సంతసం బున లక్ష్మి నహితంబుగాను - దంతీంద్ర వరదుండు దయమీరభక్త - వరులనుబ్రోచుచు వసుధనుయుండే-మరి వినగను యాసమాచార మెట్టు-లన్నను తిరుపతి రామచంద్రులకు - విన్నవించెద మహావేడుక లలరా.

వ॥ యిట్లున్న సమయంబున.

విఘ్నేశ్వరవేషము-మధ్యమావతిరాగం-తెర-ద్విపద.

వ॥ ఆహో ఫ్రోరినాయనా! మీా రెవరయాస్వామి!

వినరన్న జెప్పెద విశదంబుగాను - అనలాక్షుడైనట్టి హరుడు మాతండ్రి కూరిమిగిరిజకు కొమరుండయేను - కోరిగంగాదేవి కొమరు పినతల్లి-అరయంగ తమ్ముడు ఆర్ముఖుండరయ-మరి సరస్వతిదేవి మా యవ్వ వినరా-విఘ్నకారులనెల్ల వేగమే తరిమి నిర్విఘ్నముగ జేతు నీ నాటకంబు ధరను శ్రీతిరుమలధాముని- దలచి- నరయగనే తెంచినాడను- వినరా.

తెరవెడులుదర్వు - ఆటతాళం.

గౌరితనయు డొచ్చెను నటింపుచు ॥ గౌ ॥ గౌరితనయుడొచ్చె గజ్జలందెలు మ్రోయా వారకభటులు కైవారము శాయగ ॥ గౌ ॥ విఘ్న కారుల నెల్ల వేగమె తరిమి నిర్విఘ్నముగను జేరితమిపుడు గావించగా ॥ గౌ ॥ ధరణిని తిరుమలధాముడౌ శ్రీనరహరిని దలంచుచు నతిరయము న తాను ॥ గౌ ॥

విఘ్నేశ్వరునిపూజించుట - ముఖారి - ఆది.

పూజాజేశెడ భక్తితోడ గణనాథ నీకు ॥ పూ ॥ పూజాజేశెదను పురహర సుత నీకు తేజం బలరిన దివ్యమూర్తికిని ॥ పూ ॥ ఆవాహనము గ అఖిలాండేశ్వర దేవాపూజలుగొనుము దివ్యసుందరరూప ॥ పూ ॥ తిరుమలవాసుని స్థిరముగ యావెంకటానాటకము గావింపుము వరు సతో ॥ పూ ॥

వ॥ ఆహో ఫ్రోరి నాయనా! మీారు చేసినటువంటి పూజ నా మనస్సునకు సంతోషమయినదిగాన యీా యొక్క నాటకమునకు యే యొక్క నిర్విఘ్నము లేకుండా విఘ్నకారులను బారదోలెదను రా ఫ్రోరినాయనా.

యాప్రకారంబున శౌనకాదిమునులకు సూతుండు జెప్పినవిధం బున ఋషులు సభాస్తనానికి వచ్చేమార్గం బెట్లనినా.

## మునులువేషం-తెర-ద్విపద-ఆరభి.

అంతనా రుషు లెల్ల నానందములగుచు-సంతోషచిత్తులై చనుదెంచువేళ-స్నానసంధ్యాద్యనుష్టానంబు దీర్చి-జ్ఞానులై నుర్వి నజ్ఞానులనెల్ల మాయతొలగగజేశి మహనీయు లగుచు-జేయదలంచిబల్ సిరులొప్పుచుండ-ధరతిరుపతీశుని కరమర్దిదలచి-నిరువందజేరిరి నిష్టులైయపుడూ ఫ్రౌరినాయనా ॥హ॥ మీారు యెవరయాస్వామి ! మేము ఋషులమురా ॥ హ ॥ మహా రుచిగావుందురో రుచిగాదురా ఋషులమురా ॥ హ ॥ యెట్లా మీారు రుషులయినారయ్యా స్వామి బైటికివచ్చి చెప్పతున్నారా నాయనా.

## తెరవెడలుదర్వు-ఆరభి-ఆది.

శ్రీ శంభజే వెంకటేశంభజే జగదీశం తిరుపతి శ్రీనివాసంభజే రామంభజే మేఘశ్యామంభజే యోద్యాధామం కోదండధరరామంభజే ॥ శ్రీ ॥ హరిభజే రిపుసంహారిభజే కదనసూరిజానకిప్రియకారీభజే వీరంభజే నగధీరంభజే వంశోద్దారంభజే మదనాకారంభజే పాలంభజే కులశీలంభ గోపబాలం కన్నయ్యదాసా పాలంభజే ॥

హ॥ మీారు యెవరయ్యాస్వామి ॥ ఫ్రౌరినాయనా మేము మాయవాదులను జొరనీకజేశి తాపత్రయములను తగలబెట్టి జగమంతయు బ్రహ్మమయంబని నిశ్చయించుకొన్నటువంటి బ్రహ్మరుషులమురా ఫ్రౌరీ ॥ హ ॥ అయితే యిప్పుడు యెక్కడికి వచ్చినారయాస్వామి.

వ॥ ఫ్రౌరినాయనా హటయోగ లయయోగ సాంఖ్యయోగ తారకయోగ అమనస్కయోగ రాజయోగ మనెడియోగాభ్యాసముచేతనున్నూ అర్దాసన కూర్మాసనకు కుకటాసన మయూరాసన పద్మాసన వీరాసనా మొదలయిన ఆసనములచేతనున్నూ ఖేచరీభూచరీ షణ్ముఖశాంభవి మధ్యమొదలయిన పంచముద్రబానములచేతనున్నూ యింకా మా యందుగల సాదనాదిక్రియలచేతనున్నూ ॥ శ్రీ ॥ హరిని మెప్పించి ఆ హరిచే మా కోర్కెలు కొనసాగ జేసుకోదలచి పీటికిగాను నిర్మల

మైన ప్రదేశమును అనగా రహస్యస్థళమునుకోరి వచ్చినానురా నాయనా ఆషా మీకు యేలాటి స్థళము వుండవలనయాస్వామి.

రు॥ చంపకపున్నాగ సరళనాగ అశ్వద్ధపనస మాతులుంగ లవంగచందనాది మంచిజాతి వృక్షములతోడను బికపికకుక్కుట చక్రవాక మయూరక్రౌంచ చకోరాది పక్షులయొక్క ద్వనిలేకనున్న మిట్టలు పల్లములు గుంటలు గులకరాళ్లు ముండ్లులేకయున్న నిర్మలమై తియ్యదనమైన చల్లని నిర్మలమైన తటాకమున్ను అందు దామరచెట్లతో పుష్పములతో ప్రకాసించునటువంటి రహస్యస్థళమును కోరివచ్చినాము అటువంటిస్థళము చెప్పరా నాయనా.

హ॥ దీనికి మించిన స్థళము వున్నదిస్వామి ॥రు॥ యేమి వున్నదిరానాయనా ॥హ॥ జిల్లేడు పల్లేరు నల్లేరు గన్నేరు యిటువంటిస్థళం తపస్సుకు బహుయోగ్యముగానున్న అప్పట్లో ఆచెట్లున్ను పనికి వస్తుందిస్వామి ॥రు॥ జిల్లేడు యెందుకురావోరి ॥హ॥ నీళ్లలోమునిగి వణుకుయెత్తుతుంటే వాయువచేరకుండా వళ్లు అంతా కాపడంపెట్టవచ్చునయ్యాస్వామి ॥రు॥ పల్లేరు యెందుకురా తపస్సుజేశి వళ్లు అలశితే పరచిపండుకొని బడలిక తీర్చుకోవచ్చునుస్వామి నల్లేరు యెందుకురా వేళకు అన్నము లేక ద్రేహముచిక్కితే నూరిపట్టిస్తే ద్రేహం బలుచునయాస్వామి గన్నేరు యెందుకురా దీని వేళ్లున్ను మంచినూనె యివి రెండున్నూ నూరి తాగితే క్షుణ్ణయకంతా తపస్సువండి మీపీడా నాపీడా విడుచునయాస్వామి ॥ చీ ॥ హ ॥ యీస్థళం మీయిష్టప్రకారం వున్నదిస్వామి.

తపస్సుదరువు-మోహన - ఆదితాళం.

తపముజేసేటి విధముఘనరే రుష్యాదులెల్లా ॥త॥ తపములుజేశెడి వుపములుగనితా ముపవాసంబున నొప్పచునిష్టచె ॥త॥ స్నానసంధ్యాజపసంస్కారంబున జ్ఞానులగుచు సన్మానముతోడుత ॥త॥ పంచిముద్రలటుబాగుగ నరసియు మించు దీప్తిచే మిన్నటుగాంచియు ॥త॥ ప్రాణామతర్పణాహుతు లొసగుచు తమనీమముతప్పక నిర్మలమతులై ॥త॥ ధరణిని తిరుపతి నరహరి కనుగొన పరిపరివిధముల ప్రార్థనజేయుచు ॥త॥

నారదుడు॥ క॥ యెవ్వడు త్రిగుణంబులు మరి యవ్విదము నటించునట్టి । యేపురుషుండో యెవ్వడు యేకగుణంబున యివ్వసుధను మోక్షమిచ్చు నేర్పరి యెవరో ॥

వ॥ గాన హేరుషులార గాన త్రిమూర్తులలోగాని ఇతర దేవతులలోగాని మోక్షమిచ్చునట్టి మహానుబావుం డెవడు యెవడు యీ యాగంబులు గొనువాడు యెవరికి యిది యర్పించెదరు హేరుషిశ్రేష్టులారా మీరు యీ వనమందు విహరించునట్టి మహనీయం లగుటం జేశి మిమ్ములనుకోరి యడిగితినిగాన మీకు భూతభవిష్యద్వర్తమానంబు లెరుంగుటం జేశి త్రైలోక్యసమాచారంబులను గురు తెరుంగుదురు రాజసగుణం తామసగుణం సత్వగుణం యీ తి గుణములలో మేటైన శాంతగుణం గలిగినవారు యెవరో దెలుపుడు రుషులార మరియొకరుషి నారదులతో హేరుషిశ్రేష్టా సురులలో వుండినా వుండవచ్చును. నరులలో వుండినా వుండవచ్చును లేక త్రిమూర్తులలో వుండినా వుండవచ్చును. నారదులు బృగులతో యేమండీ బృగుమునీంద్రులవారు మీరు యేమి శెలవిస్తారయ్యా ॥ బృ॥ అయ్యా దేవతులలో వుండరు నరులలో వుండరు వుంటే త్రిమూర్తులలో వుందురు యెట్లంటే.

గీ॥ ముగ్గురు మూర్తులు మూడు తెరంగులై యున్న వారంటంచు । యొప్పమీర వినియుయుందుమున్న వేడుకతో వారిచేరి మరిపరిక్ష చేయవలయు ॥

గీ॥ యిట్టి పనికిబోవ నెవ్వరునూపెద రెవరుజెప్పరయ్యా యీవుతోడ సురులనరుల । గాంచి పరువడిమీరంగ యరుగ దేరవలయు యతివరేణ్యా ॥

వ॥ అనిన బృగునితో ఋషులు చెప్పటం.

దర్వు రేగుప్తి - ఆటతాళం.

పోజాలమయ్యా యీపనికిని. ॥పో॥ పోజాలమయ్య యోపుణ్యాత్మ బృగువర్యా జేజాలమయ్యా యీక్షితినిపరిక్షకై ॥పో॥ నారాయణుడో శివుడో నరయవిరించియో సారెకుమనమున సంశయమునుదోచె ॥పో॥ మాచేతగాదింక మహనియ్యానీవె యీఘాతంపుపనులను కాజే

యవలె మేము ॥పో॥ ప్రేమతో తిరుపతిరాముల మదినుంచు మోహమహ
నియ్యనీకాగాక మే మింక ॥ పో ॥

గీ॥ పుణ్యపురుష నీవు పొందుగా యాబ్రహ్మ। వంశమందుబుట్టి
వసరినావు। నీకుగాక యితర నెరజాణులనగాన। పోయివేగరమ్ము భృ
గవరేణ్య ॥

వ॥ అలాగేపోయి వచ్చెదనయ్యా, ఋషిశ్రేష్టులారా.

బృదర్వు-ఆట-రేగుప్తిరాగం.

వెడలెనెభృగుడు-పరితుష్టుడై ॥వె॥ వెడలెనుభృగుడంతవేడుకలల
రగ పుడమిచలించగకడురయమునతాను॥వె॥ కైలాసమునకేగి గౌరినా
థునిజూచి మలుగయాబ్రహ్మమేటి దేవునిగనగ ॥వె॥ యేమనితర్కిం
తుయలమిని తిరుపతి రామునిదయను నేనెమారసనుచును ॥వె॥

సం॥ వ॥ యీప్రకారంబున భృగుమహాముని సత్యలోకమునకు
జనుచున్న తదనంతరంబున బ్రహ్మదేవుండు సభాస్థలానికి వచ్చుమార్గం
బెట్లనిన.

బ్రహ్మదేవునివేషం-తెర.

వ॥ ఆహోవ్రారినాయనా.

క॥ హరినాభికమలమందున అరయగ జన్మించుపద్మమందున నే
నుగ। విరివిగజన్మించియు హరికరుణచె వెలసిన హిరణ్యగర్భునిగదరా॥

బ్ర-తెరవెడలుదర్వు-మధ్యమావతి-ఆది.

కమలాసనుడు వెడలెనపుడు తనదేవినిజేరుక ॥క॥ కమలాసను
డటుకరుణనుభారతి రమణతగొలువగ విమలుండై తా ॥ క ॥ చతురాన
నములు చతురతమెరయగ అతివేగమె వేదములటు జదువుచు ॥క॥
తిరుపతిరాముల కరుదాసుతుడని పరిపరివిధముల స్మరియింపుచు తా॥

బ్ర॥ హేభారతి-యేమిప్రాణేశా.

క॥ కామునిభారికి బల్కియు ప్రేమతో నినుదలచుచుంటి
ప్రియమున, మదినే కామకుడై యదుదెంచితి నీమంబున రతులదేలనీ
గదె చెలియా.

సరస్వతి॥ గీ॥ బ్రహ్మవెత్తులకును భావింపగా శ్రీల। భ్రాంతిలేద టండ్రు బహువిధముల। వినియు యున్నదాన వేగంబె మరుకేళి। దేలర మ్మటన్న దేమివింతా॥

వ॥ నీవు బ్రహ్మవేత్తవు నీకు శ్రీలపై భ్రాంతి యేలస్వామి.

బ్ర॥ గీ॥ అగ్నిహోత్రపు చెంతను ఆజ్యగటము। నున్నకరుగక యుండునే సన్నుతాంగి। అటులశ్రీలను జేరియున్నట్టి వారి। మనసుకరుగక యుండునే మంజువాణీ॥

సం॥ యీప్రకారంబున బ్రహ్మదేవుడు భారతీ సమేతుడై యున్న సమయంబున భృగుమహాముని బ్రహ్మదేవునిజూచి యిట్లనియె.

బ్ర॥ గీ॥ జపతపంబులు జేసిన జటులుడనుచు। నన్నుగాంచియు లేవక యున్న నీదు। మరిరజోగుణమిట్టిదేమందు నిన్నుతగిన। శాపంబు నిత్తు తత్తరపరంగా॥

వ॥ హేబ్రహ్మదేవా బ్రాహ్మణ్ణి సకలశాస్త్రసంపన్నుడని యీరేడులోకములయందు ప్రసిద్ధికెక్కిన మహారుషిని నేనురాగా లక్ష్యపెట్టక నీనిజభార్య అయిన సరస్వతినిజేరి లేవక మరియాద చేయకయున్నందున యీబూలోకంబులు నీకు గుడిగాని పూజగాని లేనేలేదుపో॥

సం॥ వ॥ యీప్రకారంబున భృగుమహాముని బ్రహ్మకు శాపమిచ్చి కైలాసమునకు పోవుచున్న సమయంబున యీశ్వరుడు సభాస్థలానికి వచ్చేవిధంబెట్లనినా.

యీశ్వరుని వేషం.

వ॥ ఆహాపౌరినాయనా.

క॥ పంకజముఖియాపార్వతి పొంకమునను గంగచేరి పొందుగ। మరి నిశ్శంకచె నేలుచునుండెడి శంకరుడనుపేరువాడ చక్కగవినరా॥

పార్వతి - యీశ్వరుడు - తెరదరువు - నాద - ఆదితాళం.

రావేరావేముద్దులగౌరి ॥రా॥ రావేరావేనీరమ్యపుకౌగిట కోవే మరియుచేకోవె సఖియా ॥రా॥ కాముని శరములుకడువడి వేచ్చెను భామరో తాళనెపార్వతిదేవి ॥రా॥ యిద్దరే కమ్మ వద్దికతోడుత ముక్కులు పె

ట్టవె మోహాముదీరా॥ రా॥ యురుముయురుము ననుయొరచుచు ప్రియము న కరికరములు పెనగటుయిటువేగా ॥ రా॥ తిరుపతిరాముల కరుణచె నిద్దరు మురియుచు నుందము ముదమున నికనూరావేరా॥

వ॥ అనిన పార్వతి యిట్లనియె.

గీ॥ శరణుశాంబశివా నీకు శరణు శరణు। శరణు నీనామమున కిదే శరణు శరణు। శరణు నీపాదముల కిదే శరణు శరణు। శరణు జేసుక వినుపింతు శాంతితోడ ॥

వ॥ అగత్యముగా దెలుపవె ప్రాణనాయకీ.

పా॥ వ॥ నీవు దిగంబరివి నీవు భూతనాయకుడవు నీవే పరబ్రహ్మవు నీకు శ్రీలపై భ్రాంతి యెందుకుస్వామి॥ యీ॥

వ॥ హేసఖి యటువంటివాడేకాని తనకు శక్తిలేకపోతే వానికి యేకార్యమున్ను కొనసాగదు గనుక నీవు శ్రీమహావిష్ణువు ప్రళయాంకత కాలమందు నిన్ను జన్మింపజేశె మదుకైటంబులను నీచే సహ్హారము చేయించుకాలములో నీవు నాకు లబ్యమయితివి నీవు ఆదిశక్తివి లోకమంత నీమాయకులోబడినవారేకాని యితరంకాదు శక్తి అనగా తన భార్య తనకుశక్తి నీవు నాకు భార్యయయి నాస్వాదీనముండగా నాకు యే కార్యమున్ను వనగూడుతున్నది. నీవే నేను నేనే నీవు అది యెట్లంటే.

గీ॥ ఆకు పోకయు సున్నంబునవియు మూడు। వన్నెలుగనుండు నమలినవన్ని గూడి। యెర్రగా నగుపడుగాన యటుల। నేను అంటియుంటక నుంన్నె అంబుజాక్షి ॥

వ॥ గనుక నేనులేనిదిన్ని నీకు జరగదు నీవు లేనిది నాకు వకటీ జరగదు వక్క ఆకు సున్నం యివియే త్రిమూర్తులు యీ మూడున్ను చేరితే యెర్రగా వుండునుగదా గనుక యేపురుషునిగాని భార్యలేకుంటే అతనికి పని జరగదు నీవు లేనిది నాకున్ను జరగదు గదవే పార్వతి.

యీ - సంవాదం - దరువు - ఆట.

యందుబోయదయందుబోయదయందుబోయద పార్వతి ॥పా॥ స్నానమొనరింపగను జనినె సరగునెత్తును శంకరా ॥యీ॥ - యింతతడవు యనుచు మదికిని చింతగలిగెనె పార్వతి ॥పా॥ యందు కిటువలె

చింతజేయుట యేమికారణ మీశ్వరా ॥యీ॥ కామహారికి పార్వ తి కౌగి టప్రేమనేలవె పార్వతి ॥ పా ॥ కామమణచగ లేక యిటుమహా కామివై తివే యీశ్వరా ॥ యీ ॥ తిరుపతిహరిదయను నిపుడేకరుణనేలవె పార్వతి ॥పేంసక్షి॥

గీ॥ అంగజుడు పూలశరములు అదిమియదను। గుమ్మతను హెచ్చి నీదుయురమ్మునాదు!। యురమునను జేర్చి బహుబంధయుతుల గలశి। మనము రంజిల్లజేయవే మంగళాంగి॥

సం॥ యీప్రకారంబున యీశ్వరుండు పార్వతి సమేతంబు గా వుండుసమయంబున బృగుండు శివునిజూచి యిట్లనియె.

బృ॥ గీ॥ కామివై నీవు నాపైన కాంక్ష లేక।తగిన మరియాదయు నులేక తన్వితోడ। గూడియున్నావు కౌవుగిట గాడముననుు। పట్టుశాపం బు నొసగెద భవుడనీకు॥

వ॥ నేను వచ్చిన నీవు లజ్జించక లేవక మరియాదచేయకున్న కారణంబుబట్టి నీతమోగుణం బిట్టిదని యెరింగితిని కాబట్టి యిక నీకు భూలోకంబున శరీరపూజలేక లింగపూజ గలుగుగాక.

సం॥ యీప్రకారంబున శివునికి శాపంబుయిచ్చి వైకుంఠ మునకు వచ్చుచున్నసమయంబున శ్రీ మహావిష్ణువు సభాస్థళంబునకువ చ్చు మార్గంబెట్లనినా.

స్వామి-తెర-పూరిద్వారకా.

గీ॥ పంతమున నాదుగీర్తనల్ భజన చేయు।చున్న భక్తులకునే కొని చెన్నుమీర।నాదు పథమిచ్చు బ్రోచుచున్నట్టివాడ। వేంకటేశుడ నేగాద వినరబృత్యా॥

ఆరభి-ఆది-కొల్లా-అలం.

యిందిరాదేవిని గానరే ఓభక్తులారా ॥యిం॥ యిందిరనను బా సెందులకేగెను సందియమిడకా చాననిజూపరె॥యిం॥ రక్తిమీర నా భక్తుల బ్రోచుచు ముక్తియొసంగెటి ముద్దులగుమ్మర ॥ యిం ॥ తిరుపతి హరిచని నిరతము దలచుచు సరగున నాతో సరసములాడే॥ యింది ॥

ప॥ యీప్రకారంబున స్వామి సభాస్థళ మందుండు సమయంబున లక్ష్మిదేవి వచ్చేమార్గం బెట్లనినా.

లక్ష్మీదేవి -వేషం- తెర.

క॥ శ్రీయని యనిశము ననుమది।పాయక దలచినను వారి భాగ్యంబుననే।నాయిల్లుగాచి సంపదలే యిచ్చుచునున్న।యట్టి యిందిర గదరా॥

మోహనరాగం-ఆటతాళం.

యిందిరాదేవి వచ్చేనమ్మా తనవిభునికడకు ॥ యిం ॥ యిందిర మరి పూర్ణేందు వదనతా నందముగను యాసుందరాంగియా ॥యిం॥ హస్తద్వయమున యమరినతమ్మి ప్రశస్తముగను వాసనలటుగొట్టగ॥ యిం॥ యిలతిరుపతిహారి నెపుడుజూతునని పలుమరుతనమది ప్రార్థన జేయుచు ॥యిం॥

వ॥ వచ్చి స్వామితో.

గీ॥ వందనంబులు దానవవైరి నీకువందనంబులు।కమలాక్ష వక్క-డీవు। వచ్చివశియింపుచుటేలనో వడినదెలుపు వేగ।కరుణించు నాపైన వేంకటేశా॥

సంహ్మోదం-నాదనామ-ఆది-అలం.

వినవేయిందిరాదేవి వినుపింతు వినవేబాలా ॥ విన ॥ నామనము నమరు కేళి మరువజాలానే ॥ విన ॥ అవురా వెంకటరాయా ఆనందమూ యానెరా ॥అ॥ అవురా నీపలుకు లెంతో ఆశ్చర్యమాయె ॥స్వా॥ నిను బాసిభుడియున్నైన నేనోర్వజాల లక్ష్మీ ॥నే॥ ననుబాసి యెటుల జనినావు దెలుపవే ॥ ల ॥ భక్తజనులకెల్ల పాలించి శ్రీమీర ॥పా॥ ముక్తియొసగకపోతి మోహనారూప ॥స్వా॥ ఆయాలె యిప్పుడేమొ అంగజతూపులాకు ॥ అ ॥ వేయామదినితమిబాయలేనైతి ॥ ల ॥ మగవాడగుచు సరి మగనిసాధించలేక ॥ మ ॥ మగువాయనుచు నాదుమరుగు జొచ్చుతురే ॥ స్వా ॥ పరిపరివిధముల ప్రస్తుతిశేయనేరా ॥ ప్ర ॥ మరునికాకలుదీర్చి మగువబ్రోవవే ॥ ల ॥ తిరుపతిహారి నీవై నీతరుణి నగుచునేని ॥త॥ తరుణివేడుటయేలా మరి కోర్కె-దీర్తు ॥ అవు ॥

సం॥ యీప్రకారంబున శ్రీనివాసమూర్తి లక్ష్మీ సమేతంబుగా వుండుసమయంబున బృగుమహరుషి జనుదెంచి స్వామిని తన్నినహారి యిట్లనియె.

ముద్దుబాలా-దర్వు-ఆది-తీరు.

దండము దేవా ననునీయండనుఘూవా ॥ దే ॥ దండమయ్యనుపుద్దండము మాని నియండ జేర్చి నన్నాదరించుమిక ॥ దండ ॥ శేవా జే శెదాచరణా శేవా జే శెదా శేవా జేతునా శేవగోనియు నీ శేవకుడగునను చెన్నగబ్రోవుము ॥ దండ ॥ యంతా నొచ్చెనో పాదమెంతనొచ్చెనో పంతమునను మీపాదము నై పైవింతగ తాకుట కెంతగ నొచ్చెనో ॥దండ॥ మానజాలనీ శేవా ॥ మా ॥ మానకవజ్ర సమానమైన నామేనుదాకి పాదమెంతగ నొచ్చెను ॥ దండ ॥ కృపనుగావుమీనను నీ యపరాధిని నేనై తిని మరి నాయపచారము తలయక మదిబ్రోవుము ॥దండ॥ కరుణజూడుమా నాపై కనరుమానుమా కరుణనుబ్రోవుము తిరుపతిపురనరహరి యెరుగగ నిను మరి మరి బొగడెద ॥దండము॥

తోడిరాగం -సీసపద్యం.

బ్భృగుమహాముని వర్యపుణ్యాత్మ నీదగుచరణముల్ నామేనీయరుదుగాను। సోకినధన్యుడై సొంపునదనరితి నామేనమీపాద నళినమట్టెతగిలి మీవిమలపాదంబెంత నొచ్చెనో యనిశేవజేశెదయలుగవలదు। దానునిపై బాలదయవుంచి వచ్చుటల్ అరయంగనేధన్యుడైతి గృహము। పావనంబియ్యె మీరి లేపనినిగోరి।యింతదూరంబు జనుదేరదెంతపనియో। ఆనతిచ్చినజేతు నత్యాసతోడ దెలుపవలె నాతో బ్భృగుమహాదేవ యిపుడూ॥

గీ॥ దేవతులకెల్ల మేలైనదేవుడేను। నాకు దైవంబు బ్రాహ్మణుండరయవారి। పాదరజమును సోకినపరమపావ।నంబుగా జేసి మీసేవకంబు జేతూ॥

వ॥ హేమునివరేణ్యా దానునితప్పుగాచి కటాక్షించి రక్షించరయాస్వామి అనిన బ్రుగుడు.

గీ॥ నీదుశేవయునేగొంటి నిర్మలాత్మ। ఆయురారోగ్య మైస్వర్యమబ్బు నీకు।నేను తన్నితినని యగ్గుపూన వలదు నిన్ను।వరిక్షింపవచ్చితి నిజము దేవా॥

క॥ నీవంటి శాంతగుణమును నీవంటి మహామహుండ నెఱుఁగఁ। జగతిఁ నీవంటి దయపరుండిల భావింప చిక్కఁడరుదె పద్మదళాక్షా॥

క॥ చూచితిని బ్రహ్మదేవునిచూచితి నింద్రాదిసురుల చూచితిసు రులఁ। చూచితిగదయా శంబునిజూచితి నీవంటివాని సొంపుగ నెరుగఁ॥

బృదర్వు-అటసావేరి.

యెంతానివర్ణింతురా నీగుణము నేనెంతా॥ యెంతానివర్ణింతు దంతీంద్రవరద నీశాంతగుణంబును సన్నుతించగనైతి ॥ యెం ॥ భవము లు బాపి సొంపుగమోక్షమిచ్చేటి భగవంతుడవు నీవే భవ్యాత్ముడవునీవే ॥యెం॥ నిన్నుధ్యానించేటి నిర్మలమతులను చెన్నుమీరగ బ్రోచేటిదొ రవునీవే ॥యెం॥ తిరుపతిరాముల శరణుజేసియు నాదు యిరువునజేరెద యిందిరేశ నిన్ను ॥ యెంతా ॥

వ॥ అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండవై సుఖంబుననుండు॥ మిదేపోయి వచ్చెదనయ్యా నారాయణమూర్తి అలాగేపోయిరమ్ము బ్రుగుమహామునీంద్రా.

సంది॥ యీప్రకారంబున బ్రుగుడు స్వామివద్ద శెలవుతీసుకొని చనిన తదనంతరంబున శ్రీమహాలక్ష్మి దిగ్గునలేచి హరితో యిట్లనియె.

లక్ష్మి మోహనరాగం- ఆది.

శెలవుదయజేశి పంపవయ్యా నారాయణమూర్తి॥ శె ॥శెలవు రొసగగనను చెయ్యనజంపుము విలశితముగ కడువేగజనెదనిక ॥ శెల ॥ మరిమరి మదినీస్మరణజేసి ఘనవరములు నొసగుచు వనరుచునుండెడి॥ శెల॥పరపురుషులఘునపాదఘాతకుని తరమాయోర్వగ పరమపురుషయిక ॥ శెల ॥ ఘనముగ తిరుపతి కనకాంబరుడా ధనుధారినినే తడయక దలచెద॥ శెల ॥

స్వా ॥ గీ ॥ శెలవు యడుగుటేమి యలుగుట యిదియేమి। జనె దననుచు బల్కుక చందమేమి। పురుషపాదఘాత పొందుగాతగిలె।నటంట బలుకుటేమి అంబుజాక్షి॥

లక్ష్మీదేవి ॥ సీస ॥ ముదమున నీతోన ముచ్చటాడుచునుండ ఘనమాని యెవ్వడోగాని తెలియ। నానిపాదంబుచే వడిమీర నినుదన్న

నా దేహమున తగిలె నళిననేత్ర। పరపురుషుండు యీపాటి శ్రీ సేవటంచు యెగ్గు దలచకపాద మెత్తియొత్తి। బలుసేవలటుజేసి బంపినవాడనగ కాపాడగలవే నీకపటమంత। దెలియవచ్చెను బయల్ చేరిపోటు నీకుదో షంబులేదాయె నీవు మగడ। వనుట మరి యొక్కటేగాని అన్య పుషరు యిటులజేసిన మెత్తురే యిలను దేవా॥

స్వామి ॥ సీ ॥ భక్తులై మనకును ప్రభలెడివారంత బిడ్డలు గానెంచు బిసరుహాక్షి। మహనీయ బ్రుగుడుతా మనకును బిడ్డడై అత్యంతభక్తితో నటుజేసె। ముదమునబిడ్డల ముద్దాడ కాల్‌చేత తన్నుటయె రుగవే తరళనేత్రి। మనబిడ్డతన్నిన మనకునుయగ్గలే భావింప బ్రుగుడుతా బ్రాహ్మణుండు। అట్టి బ్రాహ్మణపాదరజంబు మనకు। లోకపావననైతిమో సుందరాంగి। యిందు కీయలుకజేయ నీకెందుకబల। యెవరినైన నీవు అలిగిద విపుడు చెలియా॥

హేసఖి॥ శ్లో॥ దైవాదీనంజగత్సర్వం। మంత్రాదీనంతు దైవచ। తన్మంత్రంబ్రాహ్మణాదీనం। బ్రాహ్మణోమమ దేవతా ॥

వ॥ అనుచు పెద్దలచేత వినలేదా జగత్తుకంతా నేను దైవం నాకు దైవం బ్రాహ్మణుండుకాగా బ్రుగుమహాముని తపస్సంపన్నుండు మహానిష్టాగరిష్టుండు బ్రాహ్మణుండు అత్యంతమయిన ప్రియభక్తుండు మనకు బిడ్డ మనబిడ్డ అయిన మస్తకుండు బ్రహ్మదేవుని ముద్దాడగా కాలుచేత తన్నినయెగ్గు తలచితిమా బాలికా.

శ్లో॥ నకించత్తేరు బారంచ। మహంమేరునై నా కించేత్తైనా బారంలేదు। నభారంస ప్తసాగరం సప్తసాగరములున్ను। నాకు బారము లేదు స్వామిద్రోహమితంబారం। దేవతాకార్యమునకు లోభత్వము జేసేటటువంటి పరమచండాలులు। నాకు మిత్తమైనబారము। భారం విశ్వాసఘాతకః। చేసినటువంటిమేలు మరచునటువంటి విశ్వాసఘాతకు లను నేనుమోయలేనని బూదేవివాక్యంబులు వినలేదా। కాగానా యొక్కబక్తుడు సన్నేమిచేసినా। మనకేమియగ్గులేదు శాంతము వహించవే బాలా॥

శ్లో॥ సత్యం మాతపితజ్ఞానం। ధర్మోభ్రాతదయాసఖి। శాంతఃపత్నిక్షమాపుత్రః షడ్డేతేమమబాంధవ॥

వ॥ యట్లంటేసత్యముతో నటించుచున్నట్టి తల్లిన్ని జ్ఞానముతో నటించుతండ్రిన్ని ధర్మముగావర్తించే అన్నదమ్ములున్ను దయచే వర్గిల్లేటటువంటి చెలులు చెలికాండ్లున్ను శాంతిగుణము గలుగునటువంటి భార్యయున్ను వైరాగ్యగుణము గలుగునటువంటిపుత్రుడున్ను యీరీతి వర్తించు యీఆరువిధంబులవారున్ను నాకు హితబంధువులని నేను జేసినప్రతిజ్ఞయరుగవా గనుక నీవు నాకుభార్యవైనందుకు శాంతము వహించవే బాలికా ॥ హేసఖి ॥నన్నుదూషించినా నన్నుతిట్టినా నేనుయగ్గుదలచను నాయొక్క భక్తులను వచించినా దూషించినా నేను వారిని భస్మీకృతముగా జేతును అని నీకు తెలిశేవుంఢినాగాని మరచితివేమో మన భక్తులపైన మనము అలకడం ధర్మంగాదు పురంధరీ.

లక్ష్మీదరువు-మధ్యమావతి-అట-తిరస్కారగతి.

యెందుకూ యీమాయమాటలు యెందుకూ యెందుకిటువలె పలకగను భోగీంద్రశయనా చాలుచాలిక॥యె॥భళిభళీనీవింతమేటా బంటువాటనుయెరుగనైతిని ॥యె॥ నీదుమగటమినేనుగంటిని వాదులేటికి తాళుమాహరి ॥ యె ॥ యితరమొగవారెవరువిన్నను మతినిమెత్తురె మాటలాడకు ॥యె॥ తిరుపతీహరి కరుణనాపై మరచెనికపలుమాటలేటికి ॥ యె ॥

స్వామి॥ వ॥ హేసఖి-యేమిప్రాణేశా.

స్వా॥ గీ॥ కరుణమరచితి ననుచు కంజాక్షినీమది। యెంచవలదుకపటమెంచబోకు। మనకు భక్తులైనమనమె కాబ్రోవలె। బ్రోవకున్నయితర త్రోవయేది॥

స్వామిదరువు-అట.

కరుణజూడవె నన్నుకమలా కమలా ॥ క ॥ నీకరుణలేకున్న నేకరణిసైతును॥ క॥ నీకరుణగలిగిన నిండుగ నిధిజేరు నీకరుణమాలిన నిర్ధానులైయ్యేరు ॥ క ॥ నినుబాసిక్షణమైన నేనోర్వగలనటె గనునీగజేసి నన్నరుదుగబ్రోవవె ॥ క ॥ తిరుపతిధాముడై నిరతము నిన్ను నేమరుక నేలుదుమన్నించి నాపైన ॥

లక్ష్మి॥ క॥ మన్నించి బ్రోచుట మరి। నిన్నటువదన్నిన బృగుండు నినుగావవలెగా। నన్నిటువలుమరుదూరుచు। మన్నించనునంతమేటి మగువనుగానే॥

గీ॥ యెందు కీరీతిపల్కుట యింకయొక్క। క్షణము నుండగ జాల నిశ్చయముగాను। యరుగుదును నేను నాపైన కరుణయుంచి। చల్లగను నీవు బృగుడు వర్ధిల్లరయ్య॥

స్వామిదరువు-ఏక-నాద-

యింతెదూర మిపుడు నాతో పంతమేలయిందిరా ॥యిం॥ యెంతవేడుకున్న నీమపంతము జూపెదవే ॥యిం॥ వింతలై దోచన వెలదిన పలుకులు చెంతజేర్చి నాదు చింతలుదీర్చవే ॥యిం॥ కాముబారి కోర్వలేను కౌగలీవె బార్గవిప్రేమ నాపై నీవు యేమారునుం చిటుకామి నిరతులనగ కలయగనిలువవె ॥యిం॥ తిరుపతిపురమేలునట్టి నరహరిరాముడనే తరముగాని యీ విరహముదీర్చవెతాళ యీ బాళివిరాళికి బాలరో ॥ యిం ॥

లక్ష్మి-దరువు-దర్బారు-యేక-

గేళియేలరాస్వామి ॥గే॥ గేళిశేయ నిదియేలరా నేను నీబాళిదీర్చునట్టి భామనుగాదురా ॥గే॥ బృగుతోడ నీవార్తవగమీర దెల్పియే మగువనైనగెచ్చి మరి నీకోసంగునను॥గే॥ నీబిడ్డడై మరి నిను దన్నెనంటివి నీభాగ్య మింక నేనేమానివర్ణింతు ॥గే॥ తిరుపతిపురహరి విరివిగవిన్నను పరిహాసింపుచు చాల పకపకనవ్వెదె ॥ గే ॥

గీ॥ మాటిమాటికియగసఖ్యమాడుటేమి। నీదుమగటమిశూరత నీదుజాణ। తనము నేగంటిమరినీదుదయను నన్ను। పంపుమి దెవందనము మీకు పద్మనాభ॥

గీ॥ బృగుడుబ్రాహ్మణుడై తన్నె తెగువమీర। పిరుకులై బ్రాహ్మణులు భువిబిక్షకులుగా। నేడు రికనీకు శిలదెబ్బలగును మరియు। గొడ్డలితో పెట్టు మరి నీకు గొల్లడేయు॥

వ॥ ఆదెబ్బలకుతాళలేక తహతహపడుదువు యిదే వందనంబులు పోయివచ్చెదనయ్యా స్వామి.

సంధి॥ యీ ప్రకారంబున శ్రీమహావిష్ణునివద్ద సెలవుతీనుకొని చనినబృగుడు రుషులంగని యిట్లనియె.

గీ॥ వినుడిరుషులారా దెలిపెదవిశదముగను। నరయగా యీశు డు తమోగుణంబువాడు। నళినగర్భుడు మరి రజోగుణమువాడు। సర సుడౌ విష్ణు మోక్షు మొసంగువాడు॥

శ్రీమన్నారాయణమూర్తితప్ప యితరులకంత సాహసంబులేదు గాన నతనిధ్యానించిన మనకోరికలబ్బుగాన యిక నేను పోయివచ్చెదన య్యా రుషులారా.

వ॥ యీ ప్రకారంబున లక్ష్మి శాపమిచ్చి కొల్లాపురంబుచేరిన తదనంతరంబున స్వామి వైకుంఠమందు విలపించేవిధం బెటులనిన.

స్వామిదర్వు-దేశియా-తోడి-ఆది.

యేమిశేతూ పరదేశినైతినేనేమి॥ యేమిశేతూ పరదేశిగజేశియా శామిను విడనాడికాడికి జేసెనే ॥నేమి॥ బృగుడేలవచ్చి తా తెగువునదన్న యా మగువకుతగిలిన మత్సరమెంచెనే ॥ నేమి ॥ యెంతవేడిన లక్ష్మి పంతములోడ నన్నీ చింతనొందగజేశె చెలినెపుడుగందును ॥యె॥ వం టిగ యిపుడు వైకుంటమునను జేరి యుంటమటన్న మనుసోర్వదే తాళ లేనే॥యే॥ తిరుపతిపురనరహరితావని తానుభాసి నరయగ వకడున్నా డంచు వాసింతురే ॥ యే ॥

గీ॥ దిక్కులేదాయె మరి లక్ష్మిదేవి నన్ను। యెంచపరదేశిగాజే శెనేమిశేతు। మమతతోడుతయే వనమందునైన। సంచరించిన మేలగు నంచితముగా॥

గీ॥ వనితకొల్లాపురంబున వడిగిలక్ష్మి జేరి। భక్తులను చాలప్రీతి చే పాలనంబు। జేతునంతును జనిన యాచెలియకడకు। బోయెదన చిన్న తనము యీభూవిలోన॥

ధన్యాశి-ఆది.

యెన్నాళ్లికులక్ష్మిని శేవింతునో నేమిశేతునో యిన్ని బంగ్రులన గుటంచునే నెన్నకమోసపోతినయ్యయ్యో ॥ యె ॥ దిక్కు-దెశ లేనివాని వలెనె వక్కరుడైతినిగా॥ దిక్కుగలిగియుండీకడకు తెగువతో యిందిరనా

నై మక్కువలేకానుయిట్టిమతమునను జేర్చెనారారా ॥ మె ॥ తోడు నీడయు లేనివానికి దోవజేసెగా వేడుకాతో నావెలదియేతోడునీడంచు భావింప జోడుబాసిబీదనై నాజోలిమాలిచనెనయ్యయ్యో ॥ నె ॥ కవ గూడతిరుపతిరాములకరుణలేదుగా యెవరికగుపడరాకమరినేనెచ్చోట దాగుదునోయరుగా భువిని కిటిదేవుండేటిపురము జొత్తునయ్యయ్యో॥

గీ॥ యింతినెడబాసి వైకుంటమేల నాకు।యేలసామ్మెల విరులే ల యేలసుఖము।జోగిగను వనమునందునే జోలిలేక।సంచరించిన మేలగు ను నంచితముగ॥

సంధి॥ వ॥ యీప్రకారంబున శ్రీమహావిష్ణువు వైకుంటంబున తలపోశి శేషాద్రిచేరి పూర్వవచనరీతిగా వల్మీకతింత్రిణీ వృక్షంబు లంగని నమస్కరించి దేవకీవసుదేవులను తలంచి అందుప్రవేశించి యి ట్లనియే.

వ॥ పుట్టలోనుంచి-స్వామి.

గీ॥ ఆకలెత్తినవేళకన్నంబులేక । నిండుదాహంబుగొనువేళనీరు లేక । తహతహపడంగన్నాయెనాతరుణికరుణ । మానినంతనెనేమందు మామహేశా॥

# 2-వ రాత్రికథ.

లక్ష్మి-గొల్లవేషం-తెరలో.

క॥ యీరీతి శ్రీనివాసుడు నారీమణిదలచి।దలచినటు వల్మీకం బారయచేరినలక్ష్మియు వారకమరియొక్కగొల్లవనితై నిలచెగ॥

గీ॥ బ్రహ్మదేవుని యావుగా బాగుపరచి। శివునియటుజేర్చిమరి దాని శిశువుజేసి । చెన్నుగాచోళపురమందుచేరివేగ । పాలు పాలంచునె మ్మె నావణతి యపుడు॥

తెరదర్వు-ఆది-ఆరభి.

హలోయమ్మపాలు భళిభళీరెగొల్లపాలు పాలుపాలు గోపాలు గొనియు మీ బాలులకెల్లను బాగుగనొసగరె ॥ పా ॥ ముత్యంబులు

నాముందరనుంచియు సత్యంబిదిమరిసరిసరిగొనరిక ॥పా॥ బాలులపోరులు పారముగను మరి చాలగనణచెటి చక్కని మాయావు ॥పా॥ నారయ తిరుపతినయముగనేలెటి సారిగొనియు మీరు చవిగని మెచ్చెటి ॥పా॥

గీ॥ పాలుగొనరె మీరు భామలందరుచేరి। పాలు మారవలమపర గతెల్ల। యావుపాలు మిగుల యానందముగ। శిశుల పోరుమాను పుష్ప బోణులారా॥

సంధి॥ వ॥ యీ ప్రకారంబున శ్రీలక్ష్మీదేవి గొల్లవనితయై చోళపురమందు గోవు అమ్ముచున్నసమయంబున చోళరాజు సభాస్థానము నకు వచ్చేమార్గం బెట్లనిన.

చోళరాజువేషం.

గీ॥ ప్రీతితో త్రిజగమందు ప్రఖ్యాతిమెరయ। రాజులెల్లనునను గొల్వరమ్యముగను। చోళభూపతియందు రేవేళ నన్ను। సభకు నటువచ్చినాడ నాసఖిని జేరి॥

రేగుప్తి-లేకమద్యమావతి-ఆట-తెరవెడలు.

చోళభూపతివెడలివచ్చెను తనసభనుచేర ॥ చో ॥ చోళభూపతి వెడలెనిదో బహుచోద్యమున మురజంబులాదిగ తాళములుతకదికితక ఝ్ఝాంకిటతళంగుతాదిమితదిగణతోంయని ॥ చో ॥ చాలగనుయిరుగడ లమరివింజామరంబులుపూనివీవగ మేలుమేలనిపొగడరశికపునీలవేణులు నాట్యమాడగ ॥చో॥ పోడిమిగ తనకులసతి వెంబాడిగనుతాచేరికొలువగ వేడుకతో తిరుపతిని వెలసిన వీరరాఘువు మదిని దలచుచు॥చో॥

వ॥ ఆహా ప్రేరిద్వారకా మనమాగాణమునందలి మెచ్చుటెచ్చుట యేయేవింతలగు సమాచారములున్న వో పోయిచూచి శీగ్రింబున రా రా ప్రేరిద్వారకా.

రాజ॥ వ॥ పదివేలువందనంబులుస్వామి.

చో॥ వ॥ సుఖంబునవర్ధిల్ల వేభాష్టునీ.

గీ॥ మొన్నడిటురావుసభకునిదేమివింత। వెంటనంటియు యిటువచ్చి వేడ్కనున్న।పొలతి నీమోము మరి చిన్నపోవు టేమి। తెలియబలుకవే నాతోను తేటపడగా॥

వ॥ హేసఖి యెన్నడురాని యీసభకు నేడు నీముఖము చిన్నబోయి యిటకు రాకారణంబేమి కుటిలాలకి.

రాజి॥ గీ॥ రాణివాసంబుమానిటురాకయుండు। మాటసహజంబె నీయనుమానముడిగి। వినినవే విన్నవించెదవేగ మిపుడు। వచ్చినటువంటి తప్పుగా వంగవలయు॥

చో॥ వ॥ హేసఖి నిన్నుమన్నించితి నీవుమనస్సున సందియమిడక వచియుంచవేపురంధరీ.

వ॥ దెలిపెదనుస్వామి.

రాజి॥ గీ॥ పాలులేకను బిడ్డడు చాలపోరు। బెట్టుచున్నాడు యెంతని దిట్టపరతు। యిదిగో బూచన్నభయపడడేమి శేతు । మరియు నాపోరు యిఖను నేమాన్పజాల॥

రాజి॥ వ॥ ప్రాణేశా ఆవుపాలుపోతామన్న మన ఆవులకు పాలంతా యెండిపోయినది మనదాదియిచ్చేపాలు చాలనే చాలదు అంతకు మునుపే నాకు లేనేలేదు యీబిడ్డ పాలుచాలక చిక్కుటగని నీతో దెలుపవచ్చితిని యీబిడ్డకు పాలుచిక్కేయోచన వెతుకవయ్యాస్వామి.

చో॥ వ॥ హేసఖి యింతమాటకు యీసభకురావచ్చునా పోపిచ్చిదానా.

భటుడు॥ క॥ వందనముచోళభూపతి । వందన మిదో యవతో వక్కవనితామణితా। అందముగ తెల్లటావును అందంమున। అమ్ముచున్నదయ్య నరేంద్రా॥

భ॥ వ॥ హేస్వామి తెల్లటిఆవును ముచ్చట అయిన వకదూడనున్ను వకగొల్ల ఆమె అమ్ముచున్నది 2 పళ్లుపాలు యిస్తుందట యిది తప్ప యేవింత జరుగలేదుస్వామి.

చో॥ వ॥ అయితే అంతఃపురమునకుబోయి రాణిగారికి తెలియచేయరాపురి. రాజితాంగితో-భటుడు.

## రేగుప్తి-ఆటతాళం.

యేమందునమ్మా నీభాగ్యము నేనే మందునమ్మా యేమందును యెక్కయిందీవగాక్షితా నేమికో గోవును నెమ్మి యమ్ముచునున్న

॥ గొ ॥ అందముతోడ నాయావు చందముచూడ యందునగానమె యిభరాజగమననే ॥ యే ॥ రెండుపళ్లపాలు మెండుగయిచ్చునె దంపి మీారగ కొనవెదయమీార నాతల్లి॥యే॥ కోరికతో బిడ్డపోరులణగునుగా ని చేరికొనవమ్మ నీమీారినిప్రేమచే ॥ యే ॥ తిరుపతిరాముల కరుణ మీాపై యున్నతరుణి యాయావును నిరతముగొనివచ్చె ॥ యే ॥

భ॥ వ॥ అమ్మా ఆయావును మనము తీసుకొంటె మనబిడ్డకు పాలుకు కరువు లేదమ్మా.

రాజి॥ అయితేపిలుచుకొనిరారావూరి.

భటుడు-గొల్లభామతో,

భ॥ గీ॥ అమ్మ నినువేగ యిపుడె మాయమ్మ రమ్ము। రమ్మ టనుచును ననుబంపె రమ్యముగను। పాలు గొనునమ్మ బిడ్డకు పాలు లేక। పోరుబెట్టుగతంబున పాలతి నిన్ను॥

భ॥ వ॥ పిలుచుకొనిరమ్మన్నదిగాన శీఘ్రంబున రావమ్మాతల్లి.

గొ॥ వ॥ ఆలాగే వస్తాను పదరానాయనా.

రాజితాంగి-గొల్లభామ-సంవాదము. ఆరభి-ఆది.

యేవూరు యేపల్లెనీది గొల్లభామ నాతో యెరుకపడగ దెలుపవమ్మ గొల్లభామ ॥ లక్ష్మి ॥ యిరువుగానే నున్నవూరు రాజితాంగి కొల్లాపురముగా నెంచవె ముద్దురాజితాంగి ॥రాజి॥ గొల్లకులమందునవె గొల్లభామ మీారె గొల్లవారయియుందురమ్మ గొల్లభామ ॥ ల ॥ చే వగొల్లలమ్మ మేము రాజితాంగి పతినిదేవునిగ గొలతుమమ్మ రాజితాంగి ॥రా॥ నీపతిపేరేమెముద్దు గొల్లభామా నాతో నిక్కముగ దెలుపవమ్మ గొల్లభామ ॥ ల ॥ వెంకటబోయుడెవాడు రాజితాంగి యితరవిషయములో జోరనివాడె రాజితాంగి ॥రా ॥ చవతు లెందరమ్మ నీకు గొల్లభామ నాతో సరసమున దెలుపవమ్మ గొల్లభామ ॥ల॥ చవతులు పెక్కండ్రుగలరె రాజితాంగి నాకు చవతిపోరు తప్పెనమ్మ రాజితాంగి॥రా॥బిడ్డలెందరమ్మ నీకుగొల్లభామా నాతో ప్రీతితోను దెలుపవమ్మ గొల్లభామ ॥ల॥ బిడ్డ లిద్దరు గలరమ్మ రాజితాంగి పక్కబిడ్డడు మేల్ విలుకాడమ్మ రాజితాంగి ॥ రా ॥ పాలు యెటులబాతువమ్మ గొల్లభామ బిడ్డకుపాలు చాలదమ్మ ముద్దుగొల్లభామ ॥ ల ॥ వేడుకా

కు వెలలేదమ్మ రాజితాంగి బిడ్డకు వేగమే తాపించవమ్మ రాజితాంగి ॥రా॥ గోవు నెంతకు కొన్నావమ్మ గొల్లభామ మరి యీగోవు యెంత వెలయౌనమ్మ గొల్లభామ ॥ల॥ నూరువరహాలిచ్చికొనవె రాజితాంగి బిడ్డలపోను మానునమ్మ ముద్దురాజితాంగి ॥రా॥ దండిగ పాలిచ్చునవె గొల్లభామ నాపైదయను చాలదెలుపవమ్మ గొల్లభామ ॥ల॥ పరగ తిరుపతిశౌరి మెరుగ రాజితాంగి రెండుపళ్లపాలు యిచ్చుగొనవె రాజితాంగి॥

రా॥ వ॥ అమ్మయ్య రెండుపళ్లపాలు యిస్తున్నదటమ్మ.

గొ॥ వ॥ అవునమ్మ.

రా॥ వ॥ అయితే యిదిగో ౧౦౦-వరహాలు అవును యిట్ల యీనమ్మ.

॥ ల ॥ యిదిగో తీసుకోవమ్మ.

సంధి॥ వ॥ యీఆవుప్రతిదినమున్నుస్వామికిపాలుయిచ్చుచున్న

రా॥ వ॥ వ్రౌరిద్వారకా.

రా॥ గీ॥ యేమికారణంబు యున్నాల్లో యీయావు।యిచ్చుపాలు చాలహెచ్చియుండె । రాగరాగపాలు రానికార్యంబేమొ । వింతగాను దోచెవినరభృత్యా॥

భ॥ అమ్మయ్యా కసువుకుడితిచాలదేమొః

రా॥ వ॥ నాయనా యిన్నిదినాలు వేశేకాడికి జాస్తిగా కసువున్ను కుడితిన్నిపెట్టుతున్నామె.

భ॥ వ॥ అయితే గొల్లవాణ్ణి అడుగవలెనమ్మా.

రా॥ వ॥ అయితే పిలుచుకొనిరారావ్రౌరి.

సం॥ వ॥ యీప్రకారంబున రాజితాంగి భటుడుతో చెప్పుచున్నసమయంబున గొల్లవాడు సభాస్థలముసకు వచ్చేమార్గంబెట్లనిన.

గొల్లవాడువేషం.

క॥ గోవులగాయుచు మేపుచునే వేళనుయున్నవాడు నేడిది యేమో।నావలన తప్పులేనిదె నావుల మేపేటి గొల్లనరసింహ్ముడనూ॥

తెరవెడలు-మద్యమావతి-ఆట.

గొల్లవాడువచ్చెను యీసభనుజేర ॥ గొ ॥ గొల్లవాడువచ్చె గొడ్డలిగొంగడి మెల్లగమూపున మెరయుచునుండగ ॥ గొ ॥ వడిశేలచే బూనివడిమీర పశువులు మెడత్రాళ్లు శలగోలమెచ్చుచుబట్టుక॥గొ॥తిరు పతిపుర రామణీయుని దయను తానరయగ యాచోళనరపతిపతిబిల్వ॥గొ॥

వ॥ వానిమాటలు వొరేనడ్డోడా పెయిదూడయేదిరా యిదోవుం డాది అదికాదురా ఆమొట్టికొమ్ములది లచ్చమ్మయ్యగారివాండ్లది అది యింకారాలేదు పటోక్క పటోక్క దాన్నినక్కడినా పాయపాయ పైల్లో కిపాయ అదివొంగపయిల్లుమేస్తాదిరా వూఅమ్మా ఆయెనుమును విడువు యింకాపాలుపిండలేదురా చిన్నాపిండండి వొరేజొల్లోడా యీ పొద్దు ఆవులు యేసాయిపోతాదిగా గుండ్రాళ్లకోనకు అయితే నీయావుల నే మలేస్తాగాని యింటికిపోయి సంగటి మెత్తుకొనిరాపో యేకర్యావుండే కర్యావు పిల్లా అదో దూడపేడ వొప్పు అమ్మో పేడయెత్తొద్దు యింద బ్బావక్కాడు వరెదాన్నిమల్లె తాతా అంత వక్కపెడతావా నేనేలేక నిన్ను అడగతామని వున్నా ఆ బాపనోళ్లు దినంయిచ్చేది యీ పొద్దు యివ్వనేలేదు॥

భ॥ వరేవరేరాజతాంగి పిలుచతాదిరా గొల్లవాడు రాజ నాతో.

వ॥ యేమమ్మా కుడితి తాగిందా యేమమ్మా యీపండుగకు భత్యం యింలేదు ఆయావు యీనితే దోవతియిస్తామంటిరే యీనే లేదుకాని అమ్మా గొడ్లుపాయ యేమమ్మా ॥ రా ॥

క॥ మందడి వినుయీయావును మందకు పంపింప పాలుమట్టై
పోయెగా। ముందట పచ్చిక మేయదో కొందరు యీపాలు పిండుకొని
రో యేమో॥

వ॥ అని సందేహము తోచుచున్నది ౧౦-౧౫ దినములనుంచి వకచుక్కకూడారాలేదు పొదుగు యెండినట్టుగా వున్నాది యీసంగతి రాజుగారితో చెప్పతాను రాజునుచూచి ప్రాణేశా.

వ॥ యేమిసఖి తిరుగా నాకారణంబేమి॥ రా ॥

దరువు-ముఖారి-ఆట-తాళములు.

పాలు లేదయ్యా బిడ్డలకిపుడు ॥ పా ॥ పాలు లేవనుచు గోపాలుని దూరిన పాలుమాలిక చేతపలుకకయున్నాడు ॥పా॥ వినుతించి నేనెంతో వేడుచు నడిగిన ననుజూచి మరి కసరినాడేమి శేతును॥పా॥ యిట్టి దుర్మార్గుని యింటనుంచక మెడబట్టి యిల్లు వెడలగొట్టినమేలగు॥పా॥బిడ్డలపాలిటి దొడ్డబూతము రీతి మడ్డివా నిటు జేర్చ మర్యాదకాదయ్యా॥పా ॥ మక్కువతో పెంచుచున్న కనరాదాయ చిక్కిపోయెను బిడ్డ చేరిటు చూడుము॥పా॥యిలను తిరుమలపురి మేలు రాఘవుదయవలన యీశిశుమతి వర్ధిల్లవలెగాని ॥ పా ॥

వ॥ ప్రాణేశా యీబిడ్డ యిన్నాళ్లు యెట్లావుండెనో యిప్పుడు చూడండి యీగొల్లవాడు పాలంతా అమ్ముకొని మనబిడ్డను పస్తుపెట్టిన చండాలుని యీక్షణమే వెళ్లగొట్టవలెనుస్వామి.

చో॥ వ॥ అయితే ప్రాణనాయకి నీవు అంతఃపురమునకుబొమ్ము నేను విచారించి శిక్షించెద.

చోళదరువు - దేశి - ఆది.

యేడీమనగొల్లడు మరివాడేడి యేడిరగొల్లడు యందున్నడో మనపాడియావుపాల్ బాగుగమ్మచ్చ్యలి ॥ యే ॥ యిమ్ముగయీపాలమ్మక పైకము సమ్మతిచేర్చి మదమ్మున తిరిగెడు॥యే॥బిరబిరయిటకునుబిలచుక వచ్చిన కొరడాల్ తీసుక కొట్టింతునుభళి ॥ యే ॥ తిరుపతిపురహరి కరుదుగ మ్రొక్కుచు తరుముకరం డిటు తడయకనేగుడి । యే ॥

వ॥ యేడిరా మందడి యిదిగో వచ్చినాడుస్వామి.

గీ॥ వినరమందడి పాలమ్ముకొనినరీతి।వీనులనువింటిని యిఖను నీ వెన్ను బగల।వెలయముక్కోణమునగట్టివేగ నిన్ను।కొరడదెబ్బలవేయింతుకోర్కెదీర॥

వ॥ గాన నిజముగా బల్కరా మందడి.

గొల్ల ॥ సీ॥ వినుదేవ మీయావు నీనయము నేగొని మేపింతు వినుము వేమారు మేదినీశ।కడగిపాలులేని కపటంబు నేనెరుగ హరిసాక్షి నీదుపాదంబులాన। నీయింటబిడ్డనై నేనున్న యీద్రోంగతనమేల జేతునా దయ

నుచాల। బ్రోవదగునయ్యా యేచోళభూమినాద। నెపము నాపైనయుం చకు నీకు నేను కదళియే నాటికై నపకారమెంచ।తద్య మీమాటనే జవదాటరాజ॥

చో॥ గీ॥ దొంగలించిన దొంగతానంగి యగుచు।మరియు తప్పిం చకొన కొన్నిమాట లన్ని।జెప్పి తప్పింపగా యెటుజేతునైన। నిన్ను శిక్షించకొదలను యెన్ను మదిని॥

వ॥ ఆహా వ్రైరి. వీని ముక్కోణమునవేసి మంచికొరడాతో ౧౦౨ దెబ్బలువేసి యిచట వుండనీక వెళ్ళగొట్టండిరావ్రైరి.

సంధి॥ యీ ప్రకారంబున గొల్లవాణ్ణి ముక్కోణమున కట్టి కొట్టుచున్న సమయంబున గొల్లవాడు విలపించువిధం బెట్లనిన.

గొల్ల-దర్బ-మోహన-ఆది.

ననుకట్టికొట్టబోకుమయ్యా యోరాజ ననుదిట్ట న్యాయమేనా రాజేంద్రా మనవిజేసితి చాల మన్నించు యీవేళ పనిమాలితప్పు లెంచపాటికాదయ్యా రాజ॥నను॥యెన్నడు నాపై నెపమెన్నవు నాత్రా తిట్లు నున్నదోకాని యితర చిన్న నేనెరుగ రాజ॥నను॥తిరుపతిపతి కృపమ రచెను కాబోలు తరమా యీఘూరికొర్వతర మాదెబ్బలకుతాళ॥నను॥

గొ॥ వ॥ హేరాజా నెపముశాయని నన్ను యీలాగు జేసిన యింతకంటే నీకు ఘూరిగల్గుగాక యిదే గోవు వెంటబోయివచ్చె దరాజా.

సం॥ యీప్రకారంబున గొల్లవాడు గోవువెంట చనుదెంచు చున్నసమయంబున గోవు శేషాద్రింజేరి వాల్మీకంబున నిలచి స్వామికి పాలు యిచ్చుచున్నసమయంబున గొల్లవాడుజూచి యిట్లనియె॥

గొల్ల-అచ్యుతరాగం-యేక.

ఆహా యిదేమివింతరా అవురవురా యీ ఆవు యెంతో మోస బుచ్చరా॥ ప్రతిదినంబు యీగతేనురా భళిభళిర యీబాట తెలియ లేకయుంటిరా॥ అధము డెవడో దొంగపగదిని యీ యావుపాలన్ని దాగుచుండగంటినీ॥ఆవుజేయు అల్పకృత్యమో లేకున్న యీ అధము జేయు ద్రోహకృత్యమో రాజుచేత నప్పణంబుగా దెబ్బలు తినత్రాత

బ్రహ్మ వ్రాసినేమోగా॥అ॥ కపట మెరుగననుచు బల్కితి రాజేంద్రుడిట్లు కరుణమాలిజేసె నీగతి॥ వేడుకంత రాజుగారికి వడిమీర దెల్పి వెళ్ళిపోదు యిపుడె యూరికి॥తిరుపతీశు డెంతజేసెరా యిటు ధైర్యమున పరులు యిట్టి పనులు జేతురా॥

వ॥ ఆహా వురేవురే నిన్నుంచి నాకు దెబ్బలాయగదరా అని వేశెవాడీల్గె.

సం॥ యీప్రకారంబున స్వామికి గోవు పాలు యిచ్చుచున్న సమయంబున గొల్లవాడు గొడ్డలిచే వేయగా వాడీల్గె తదనంతరంబున గోవు దేహం రక్త చిత్తాంగై అజారము ముందురాగా.

వ॥ భటుడుచూచి రాజుతో యిట్లనియె.

భ॥ గీ॥ స్వామి యిదో చూడు। చయ్యన మన యావు రుధిర దేహి యగుచు రూఢి మెరయ।వచ్చి దూడతోడ వాకిటనున్నది। లేచి రమ్ము వేగ యోచనేల॥

వ॥ అనిన అవునుజూచి చోళరాజు.

దరువు-రేగుప్తిరాగం-అటతాళ.

యిది యేమివింతా యోజనులారా ॥ యి ॥ యిదియేమివింత యో మెరుగంగనైతిని మదితలపోయ యీమర్మమెరియనైతి ॥ యి॥ ప్రొద్దునుండగ నిది పద్దుచేరాగ యీ ముద్దుయావు తెనకొ గ్రద్దులు పరచిరి॥యి॥ తెల్లరూపగుగోవునెల్ల దేహము రక్త మెల్ల మునింగిన దెల్లనెంచిచూడ ॥యి॥ తిరుపతిపురనరహరిచేత యీయావు మరి మరి వద్దిల్లునంచు నెంచుచునున్న॥యి॥

గీ॥ ప్రొద్దుబోకయున్న।పొందుగ యీయావు వచ్చినట్టి।జాడవడి గదాని వెంబడించి బోయివేగమే। గందము జనకయున్న దీని గనుట యెట్లు॥

సంధి॥ యీ ప్రకారంబున గోవు పోవుచున్నంత రాజు భటులచేరిపోగా గోవు శేషాద్రికింబోయి వల్మీకం ముందు నిలువగా స్వామి లేచి రాజుతో యిట్లనియె.

స్వామి-ద్విపద-ఆ-సావేరి.

ప్రోరిపాపాత్ముడ - ప్రాకులద్రోహి - ఓరి నీగర్వంబునడిమీర ద్రుంతు-వినుము యెవరనుచు-భావించితివీవు - వనరైన వైకుంఠవాసు గానెంచు-నాసతి నను బాసి-నయమున- యిట్లు-జేరిన యీపుట్టజేరగ-నాకు తోడునీడయు-లేక-దుఃఖింపుచున్న-నాడు-నేడనక-యన్నంబును-లేక-ఆకలికిని-నోర్వజాలకయున్న-యాకలివేళ-కీయావురుదెంచి- నాయాకలి దీర్చినా- తెరగెరిగి నాయావు-మేపెడినమందను-యిదిగో-గొడ్డలిచె-నావు గొట్టనే-నపుడు-అడ్డమైరాగ-నాగొడ్డలిపెట్టు-తగిలెనువా-డట్టె ధరణిపై గూలె-వగ లేక-నీమనవశుభీశుడగుచు-యిటులు-జేయించిన - యికమీావ నీవు-చటులత-మెరయపై-శాచివై -జనగశాపంబు-నొసగితి- వైచక - నిన్ను-నీపల్లితిరుపతి-నేలేటి-రాము-డున్నాడు-పోపోర నన్నునుగాచె-మన్నాడు-నీతోన-మాటేమి-యిఖనూ.

చో॥ ముఖారి॥ గీ॥ హరిహరి యేమి శేతునో పరమపురుష। యిట్టి చండంబు యెరిగిన యేలకడకు। తలను నడచియు పాలిన్ని త్రావజేతు। నెపము జేయగలేదయ్యా నీలవర్ణా॥

వ॥ ఆహా స్వామి యిట్లెరింగిన నేలగొల్లవాని దండింతు మహానుభావా కటాక్షించి నాయపచారంబులను మన్నించి నన్ను శాపవిముక్తునిగాజేయుమా శ్రీ హరి.

స్వా॥ గీ॥ మించియిచ్చిన శాప మేమనుచు దీర్తు। ధాత్రిరాజు ముద్దుతనయమైన।పల్లవోష్టిమేటి పద్మావతీసతిక్। పెండ్లియాడువాడ ప్రేమమీార॥

వ॥ అపుడారాజు నవరత్నఖచితమైన ౧౦౦-బారువుల బంగారు కిరీటం బొసంగు అది నేను ప్రతి శుక్రవారమున్ను ౬-గడియలు ధరింపుదు నపుడు నీవు మానవరూపమెత్తి నేను తీసిన తిరుగా పిశాచివగుచు యీా తీరున యీా కలియుగాంత్యమువరకుండుము యిదే శాప విమోచనమయ్యా రాజేంద్రా.

సం॥ యీా ప్రకారంబున చోళరాజు పిశాచరూపంబున చనిన తదనంతరంబున స్వామి లక్ష్మిని దలచి యిట్లనియె.

స్వామిదర్వు-పున్నాగ-ఆది-అలంకారం-పొంబది.

యిందిరా అయ్యో యిందిరా నేనేమిశేతునె ॥యిం॥ యిందిరా నన్నిందుబాసి యెందుజేరినావు యికనే మందు నిన్నెడబాసి నా శ్రీ మాటక్కె గల్గెను యేమిశేతునె ॥యిం॥ ఘాశిపడ నిటు నన్ను నీవెడబాసి నాపై నీదు కరుణయురోసి లోకంబునను ననుపరదేశిగను జేశితివి గదవే ॥ యిం॥ ఘనముగా వైకుంఠ మెడబాసినది మొదలుగ పుట్ట జేరుక ననువుగా గోవరుగు డెంచియు నాదు యాకలి దీర్చనాయనె॥ యి॥ అదియు జూడక లేక మరి యా అధము డొక్కడు గొల్లడటు తా నదిఋగొడ్డలిచేత మస్తకమదర వేసెను యేమిశేతునే ॥యి॥ రాత్రి పగలును తీపుచేతను రామరామా యనుచు మరి నా నేత్రములకును నిదురరాక నేగుచున్నా యెవరు దిక్కుక ॥యి॥ మందు మాకును దెచ్చి దీనిని మాన్పగానె నెవరి వేడుదుకొందు ఫుక్కటిదోచలేదే, మంమనేవ్రా కుందరదనా ॥యి॥ గట్టిశాపము నొసగి గొడ్డలి పెట్టుబడునని నీవు జెప్పినమట్టు లాయెను నీదు మహిమేమనుచునే కొనియాడుదు నెభళి ॥యి॥ ప్రేమతోడుత తిరుపతిపుర రాముడె నా తోడునీవై నా మనవి విని భాధదీర్చును నాథుడై తా నెపుడువచ్చునొ॥

స్వా॥ గీ॥ గొడ్డలినియెత్తి క్రూరుడై గొల్లవాడు। పట్టివేయుమటంచు శాపంబు నీవు। పెట్టి జనుచందమాయనే నెటులపైతు। యెచట నున్నావు నిన్ను నే నెపుడుగందూ॥

సంధి॥ యీ ప్రకారంబుగా స్వామి లక్ష్మిని తలచిన తదనంతరంబున శ్రీనివాసుండు తనగురువైన బృహస్పతిని ధ్యానించగా దేవగురుడు సభాస్తళంబునకు వచ్చేమార్గం బెట్లనిన.

బృహస్పతులవేషం-దర్వు-యేకతాళం-మద్యమావతి.

దేవగురుడువెడలివచ్చెను వైకుంఠకడకు ॥ దే॥ దేవగురుడువెడలి వచ్చే దైవబృందములు గొలువకావవే శ్రీహరిహరియని కడుముదమున దలచుకొనుచు ॥దే॥ వెంటను తనశిష్యులెల్ల వేదములను జదువుచుండ జంటగి ప్రియశిష్యులెల్ల చయ్యన తన కెదురునిల్వ॥ దే॥ తిరుపతిపురహరిని మదిని స్మరణజేసి ముదమున యాహరికరుణచె మరియు నారాయణుని సేవింపగదలచియు ॥ దే॥

స్వామి॥ వ॥ పదివేలువందనంబులుస్వామి॥

బృ॥ వ॥ సుఖీభవ సుఖీభవ సుఖంబుగా వుండుము శ్రీనివాసమూర్తి.

బృ॥ గీ॥ యేమిపని కిట్లు దలువగయింది శేశ।ముఖము మరి చిన్న బోవుట ముదముదక్కె।పుట్టలోచేరి కాపురముండుటేమి। యెంచ నాశ్చర్యమునుదోచె నేమిగలిగె॥

వ॥ అవ్విధంబగుటకు కారణమేమొ దెలుపుమా శ్రీనివాసా.

స్వా॥ వ॥ చెప్పెద నాలకించుము స్వామి.

బృ॥ గీ॥ బృగుడు ననుదన్న నాధగుపోలతికికను।తగుల నలగియు ననుబాసి తరలె నేను।పుట్టలో జేర నొక ఆవు పొందుగాను। పాలొసంగియు తాను కాపాడుచుండె॥

క॥ అప్పుడొకగొల్లడు దానిని నెపమొంచియు ఆవునేయ నేనడ్డపడగా। కృపయుంచక మస్తకమున యీాపగదిగా దెబ్బవేశె యే మందు యికగ॥

వ॥ నాటినుంచి తీపునకోర్వక రేవగలు నిద్రలేక మాన్పుటకై మందు దెలియక మిమ్ముదలంచితి నింతియేకాని మరి నొండేమియు లేదు కటాక్షించిచెప్పుమాస్వామి.

బృ॥ గీ॥ పత్తిదెచ్చియు జిల్లేడుపాలదడిపి।ప్రొద్దు కిరుపూట వేశిన పోవుకొంను।-నన్ను దలువనాశ్చర్యకరములయ్యె। పోయివచ్చెదనా నిజ పురమునకును॥

సంది॥ వ॥ యీాప్రకారంబున బృహస్పతులు చెప్పినరీతిని స్వామి మందుకొరకై సంచరించుచున్నంతలో వరాహమూర్తి సభాస్థలంబునకు వచ్చేవిధం బెటువలెను.

## వరాహమూర్తి-తెర.

గీ॥ యిటుల వృషభాసురుని సంహరించి మరియు।వెంకటాద్రికి వేంచేయవేట్కతోడ।దాలుకత్తియు పూనితాదర్పమునను। ప్రేమమీారగ నావరాస్వామి వెడలె॥

తెర-దర్వు-ఆట-తోడి.

కిటిదేవుడరుదెంచను వేడుకమీర॥కి॥ కిటిదేవుడరుదెంచె తటుకు నభూతల మటు లదరగడ క్షత్రములు బెదరగ॥కి॥సురచిరగతి వృషభాసుర సంహారించితా పసుపడివేంచేసె ప్రాజ్ఞులుమెచ్చగ॥కి॥ తిరుపతిపురసరహరి దయచే రిపునితరిమి తరిమి తెగటార్చితిగదయాని ॥కి॥

వ॥ స్వామినిజూచి యిట్లనియె.

గీ॥ యెవ్వడవు నీవు పొదలోన యివ్విధమున।తగిలిననుజూచి యెచ్చోట దాగుటేమి।క్రొవ్వనణచెద చక్రంబు రువ్వితిదిగో। పేరు నూరును దెలువుమా ప్రేమలలరా॥

స్వా॥ గీ॥ యేమి వ్రాదేవ నన్నివు డెరుగవేమొ। గురుతు దెలియదో నీకు నా మొరయు వినుము।చెలగి వైకుంఠముననున్న శ్రీనివాసు। డనగ నన్నెరుగవటవ్రాయి ఘనవరాహ॥

వ॥ ఆహా ! మహానుభావ మీరా మీరాస్వామి అపచారినై నిన్ననరానిమాటలాడితిని అయినప్పటికిన్ని.

గీ॥ వడిగవైకుంఠ మొదలిటువచ్చుటేమి। లక్ష్మి యురమున లేనట్టి లక్షణంబు।కదశితలగాయమేమొ యీకలతెరంగ। తెలియబలుకుము శ్రీపతే తేటపడగా॥

వ॥ అవ్విధంబేమో తెలియబలుకుము స్వామి.

స్వామి-దర్వు-కలతెర-తాళము-అలంకారవు.

యేమనిదెలుపుదు నీతో కిటిదేవ అయ్యో కిటిదేవ యిప్పుడుయేమని తలపోతునీతో ॥కి॥ వక్కనాడుబృగుడరుదెంచికిటిదేవా॥అ॥ నన్ను వడిగదన్నె నేమిసేతు కిటిదేవ॥యే॥లక్ష్మికి నాదెబ్బతగుల కిటిదేవా॥అ॥ నన్ను లక్ష్యముంచ కేగె తాను కిటిదేవ॥యే॥ దిక్కులేనివాడ నగుచు కిటిదేవా॥అ॥ నేను వక్కరుండనై పుట్టనుంటి కిటిదేవ॥యే॥గోవునను పోషింపుచుండా కిటిదేవ యొక్కగొల్లవా డదిగాంచెనయ్యా ॥కి॥యే॥ గొడ్డలిచే క్రూరుడగుచు కిటిదేవా యిదిగో నడ్డచేయక ఘాతచేసె॥కి॥యే॥ తీపులకు వ్రోర్వలేక గ్రీష్మతితో దెలుపామందు జెప్పి ॥ కి ॥ యే ॥ మందుకొరకై వనమందున ॥కి॥అ॥ యొచ్చిమందు వెదకుచున్నం

తలో॥కి॥యే॥ నిన్ను గననావ్యసనముదీరె కిటిదేవా ॥అ॥ తిరుపతినున్న రాము డెరుగుసయ్యో కిటిదేవా॥

సీ॥ దిక్కులేకను పరదేశినైమైనన్ కాపాడవలె నీవు కనికర మున। నొప్పికి నేతాళ అప్ప నీదాపునచేర్చియు మరియు నేజేయునట్టి అపరాధములనెల్ల నట్టె మన్నింపుచు వేట్కతో గొంత తావియ్యవల యు।తోడులేదాయనీ తోడునే గోరితి।నిలువనీడయులేను నిజముగాను వచ్చి వాల్మీకమునుజేరి వసరుచుంటి।నాగతిట్లయ్యె తిరుమలనాథ యి పుడు। యిట్టి వుపకారమును జేయ నీవె నాకు। తల్లితండ్రి విధాత్రిలో తద్య మిదియూ॥

వరా॥ గీ॥ వినుము బలవంతులకును తావియ్యరాదు।చేరి పేద లకును యాశ చెప్పరాదు। యిట్లు జేసిన వ్యసనంబ వినుచు ననుచు। పెద్దలెల్లను బల్కరే ప్రేమలలరా॥

వ॥ గావున నేనియ్యజాలనుస్వామి.

స్వామికందార్థము-రేగు ప్తి-ఆట.

ప్రేమతో విను నూరడుగులు భూమిని నాకిమ్మటంచు పొగడు క యడుగగ యేమకో యీరీతిని నీ వీమాటలు బలుకుటెల వినువరా స్వామి యిచ్చిన నీకు ఘనతె కాదేమి యేమయ్యా యిట్టి సందేహామే లను మదికి యెన్నటకైనా నీ కెగ్గుదలంచాను విను.

వరా॥ కందా॥ నేరుపుతో నీభూమిని। నూరడుగుల నడుగ నీకు నొయ్యన। యిత్తుగ జేరియు నిపుడే నాకును। చేరెడు పైకంబు లియ్య యిత్తును దీనిగ। యిచ్చిన నిన్ను మెత్తు నెట్లయినన్।'అరుడుగ నూరు వరాలిచ్చి గొను దీని అనుమానముంచకుమయ్యా వెంకటరాయా।

స్వామి॥ వ॥ హేవరాహమూర్తి నా భక్తులైనవారు నా దర్శననిమిత్తమై యీ శేషాద్రికి వచ్చుచున్నారు. వారివద్ద యాచించి నీకు చెల్లుపెట్టుచున్నాను యిదిన్నిగాక ముందుగా నీకు పంచామృత స్నానపూజలు తరువాత నాకు పూజలు యిది తప్పను వరాహా.

౧ అడుగుపైన, ౨ అడుగు భూమి, 3 అడుగు తలం.

స్వామి॥ వ॥ యేమయ్యా వరాహమూర్తి రాత్రి పగలు నీవు

చేత అనస్తపమతున్నాను పరిచారముకు వకమనిషివుంటే బాగా వుంతునుస్వామి.

వరా॥ ఆలాగే యిస్తున్నాను స్వామి.

సంధి॥ యీప్రకారంబున శ్రీనివాసుడు వరాహమూర్తిని అడుగుచుండగా వకుళమాల సభాస్థళముకు వచ్చువిధం బెట్టదనిన.

క॥ మానినీమణి వినమమ్మ మహినిశేష।గిరి నివాసుండగు వేట్కాపరగుచున్న।వరాహదేవ్రుని దాశినే వకుళమాల। యనగ వినమమ్మ తెలిపెద యబ్జవదనా॥

వకుళమాలికైవేషం-తెరము-అ-ఘనం.

వకుళామాలికవచ్చెనమ్మా వేడుకమీరా॥ వకుళాదేవియు వరహాదేవ్రునకు నక లుపచారము సలుపగ దలచుచు ॥వ॥ ప్రౌఢా యను యిక పోవలె ననుచును ముద్దు గుమ్మలతో ముచ్చటలాడుచు॥ వ॥ తిరుపతిపురమున నిరువ్రగనున్న రగువమని మనంబున వడిగను దలచుచు ॥వ॥

గీ॥ వకుళమాలను నీ కిదే వందనంబు। వసుద వృషభాసురారిదో వందనంబు। వరహాదేవ్రుడ నీ కిదే వందనంబు। యే పని నొనర్తునే నిక నింపుమీరా॥

వ॥ పదివేలవందనంబులు మహాప్రభో.

గీ॥ ఘనతతోడుత।చిరాయువ్రగాను నీవు వసుధయందును మేలుగా వర్ధిలుచును। నుండతగుగాన యివ్వు డీపుండరీకవరద।తెరగెరుగ వింటివా వకుళ నీవు॥

వరా॥ హే వకుళా యీ మహానుభావుని తెరంగు వింటివా? లేదుస్వామి అవ్విధం బెరుంగ తెలుపవలెస్వామి.

వ॥ చెప్పుతాను వినవే వకుళా.

సీ.తా॥ పొలతి నెడబాసి వొంటిగా పుట్టలోన।గోవుపాల్ తాత్రాగి నున్నగొల్ల డొకడు। గొడ్డలిచే ఘాతపడనేయకుంది యితడు। తీవునకు వొప్పలేక। యీతీరు నా పంచజేరినారు బతిమాలి వేడుచున్నాడు। సుందేమియు తా మెరుగారు। దూరక వీరిని కోరినటుల వుపచారము శేయగ చాల వేడుకున్నారు॥

గీతా॥ యితఁడు వెంకటపతి యనుచు యెన్నుమదిని।గాయమున కునును।మంచే।కాయుచున్న నీకు పదమిచ్చు మఱియును।నీదు బిడ్డగాను యెంచి పరిచారకంబు యీవేళ।జేయవె ముద్దు బాల కనికర మెంచి। చాల పోషింపు సందియమేలా।వినగదవే వకుళమాల।బాలామణి యిక మేలగు యిందిరలోలుఁడె మరి నీబాలుఁడాయె॥

వ॥ హేవకుళా నా మాఱుగా నన్ను పోషించు రీతిని యితణ్ణి నీబిడ్డగా నెంచి పోషించుము నీకు మేలు కలుగునే వకుళా.

వకు॥ కందార్థము॥ హాటకచేలా నీదగు।మాటయు జవదాట యీ రమాపతిశేవే। నాటికి గలుగునోనంగి నాటికి లభియించు భాగ్యమాయగా। దుఃఖము తొలగిపోయగా। సుఖమంను వేళనాయగా। నా జన్మ సఫలమాయగా। హాయగసామిని యానందంబున।అనుదినమును దరిశన మిక శాయా నాయగా॥

గీతార్థము॥ చేరి జపతపహోమముల్ జేశి చేశి।కడకు వేసారి వేసారి గనగలేని।అట్టి పరబ్రహ్మమూర్తిని అనుదినంబు।ఘూశి లేకను నే జూతుగాక యికనూ॥

వ॥ ఆలాగే పుత్రునివు ప్రకారం గావించెదస్వామి అని స్వామితో యిట్లనియె.

వకుళ-శ్రీరాగం-ఆట.

పదరా వెంకటరాయా పదరా నాసామి సదయుఁడవని నిన్ను నన్నుతించెదవేగ ॥ ప ॥ స్నానము సంధ్యానుష్టానంబుదీర్చి సన్యాసము తోడ శ్రీ చూర్ణమిడగనువేగ ॥ప॥ పులిహోర చక్కెరపొంగలి యుక్కెర మళిహోర చిత్రాన్న మటులారగింతువు ॥ప॥ పరమాన్న దధ్యాన్న పాలాన్నశాకాన్న సరియా కేశరాన్న చయ్యన మెక్కగ॥ప॥ కాయకూరలు మంచి కమనియ్యచోష్యాలు పాయక నొసగ సాపాడగానువేగ ॥ప॥ తిరుపతిహరియైన వగరాఘువును దయ నిరతము కోరినే నరశితినేవేళ॥ప॥

సంధి॥ యీ ప్రకారంబున వకుళమాలిక శ్రీనివాసమూర్తిని పోషించుచుండ నొకదినంబున పూర్వవచనప్రకారం స్వామి భోయవేషంబును ధరియించి వేటలాడెమార్గం బెటువలెను.

స్వామి-దర్బ్వ-ముఖారి-ఆది.

వేటలాడగ వెడలె నపుడు నారాయణమూర్తి॥ వే॥ వేటలాడుటకు వేడుకలలరగ ఘోటకమును తా నీటుగ నెక్కి-యు॥ వే॥ వాలుకత్తి బలుడాక చేబట్టుక చాలగ మరి శరచాపములను గొని ॥ వే॥ దరణిపతి పతిని దలచియు మృగముల తరిమితరిమి దాని తరుగుడు నడుచును.

సంధి॥ యిట్లు వెడలి కలబంబును గని తరుమ నదిగానక వగచి నారాయణవనంబుచేరి నొక వనదాపున కరుగుచున్నంత నచట పద్మావతి చెలుల సహితంబుగా సభాస్థళంబునకు వచ్చువిధం బెట్లనిన.

## ౩-వ రాత్రికథ-పద్మావతీవేషం.

తెర-ఆనందభైరవి.

శ్లో॥ శ్రీశాయా సుగుణామ్నాయా। శాంభరీపతిమిత్రనే। భోగిశయనత్వంనిత్యంభ। జేహం లక్ష్మినాయకం॥

అంబాప్రార్థన॥ ఆది॥ జననిరోనను గావరాదటే। జగజ్జననీ నీదాననుగానటే। జననిరో నీపాదవనజములను నామనమున నెంచితి। మరువక నను బ్రోవవే॥ జ॥ కాశిపురి అన్నపూర్ణ కనకవల్లి మహమ్మాయి దోషనాశనీం దుఃఖహారి కారిణోరి॥ జ॥ దుష్టగ్రహా దుష్టమంత్ర దుష్టయంత్రహరాందూరం దుష్టరోగ దుష్టరోగ దుష్టశూన్యం కేంకేం॥ జ॥ వుగ్రజ్వాల రుద్రరూపి ఓంకారిశాంభరి వుగ్రమారి శూలదాడివ్రా మహమ్మాయిపాహి॥ జ॥ తిరుపతిరామ సహోభాకరీం పురహారుకులసుందరీం వరభక్తరక్షణీం హ్రీం వైష్ణవిశ్వరూపిహెహాం॥ జ॥

ద్విపద-శృంగారరసం.

చలని పన్నీట జలకంబులాడి-మల్లెమొగ్గల చీరె-మైనిండగట్టి రహిమీసరిగబుటాల-రవికొప్పదొడగి మహిలోన-వెలలేని మంచిరత్నాల-సొమ్ములు ధరియించి పొంపు-దీపింపకొమ్మలెల్లను జేరి- కోరికపురంపు విడెములం దివ్యగావేగమే-తనడు కడురమ్యమైనట్టి-ఘనమైనవనము-

గాంచవాంచటుబుట్టి-కడువేగమునను-చెంచలాక్షులు తన్నుచేరి- సన్నుతిశేయ ప్రేమతో-తిరుపతిరామ శ్రీరామ- రామయటంచు నారమణియు వెడలె.

శా॥ రావే మానిని రావే కుందరదనా రాజీవ నయనాఘనా రావే పద్మిత మోత్తమాంగి సదనా రావే సుహృద్భూషణా రావే నిన్నునుదక్క వేరుహితులం రమ్మనుచునే బిల్వనే నీవే నా కికదిక్కు చిక్కితనవే నీరేజపత్రేక్షణా.

వ॥ నీవు రావే అమ్మా నీవు రావే అక్కా అనిన చెలికత్తె.

క॥ ఓ రమణిరో నీవిప్పుడు। రారమ్మని నన్ను బిల్వ రానే పోవే। పేరెద్దియొ యూరెద్దియొ। సారెకు దెలిపినను యిపుడెచయ్యనవత్తుగా॥

హాస్య॥ నీ వూరేమొ నీ పేరేమొ నీ తల్లి తండ్రు లెవరో చక్కగా దెలుపవమ్మా తల్లి.

ప॥ వ॥ అమ్మయ్యా ఆలాగే చెప్తానుగాని సావధాన చిత్తురాలవై ఆలకించవే బాలకీ.

హా॥ వ॥ చెప్పవే ఘనవేణి.

ప॥ సీ॥ నళినాక్షి నారాయణవసంబటం చొక్కవింతైన పురము తా వెలయుచుండ। ఆపురిపాలించు నాకాశరాజు తా ధరణిదేవియు గన్నతరుణినమ్మ।యింతిరో వినుము యీ వసంతకాలంబున। శృంగారవనము తెరంగుజూచి। వనదేవతులు పూజ లొనరింప బలుతెంపునటు సొంపు గలిగినే నళిననేత్రి। పేరు పద్మావతీయనీ పెంపునొంది।యున్నదానను యావనమున్నచోటు। తెలియజూపింపవె ముద్దు చెలియ నేడు వెంటనంటియు వత్తు నాల్గింటి వినవే॥

తెరవెడలు-మోహన-ఆనందరసం.

యేమేమే ఓ చెలులారా ఆరామ మెచటున్నాదో దెలుపరే రామలారా రారోయమ్మ మదిలో నాభక్తిచెద రానీకను యాసదయుడా వసంతుని పూజింతము॥ భూజాములచేరి వనపూజాలు గావింతాము రారమ్మలారా రారో॥య॥ నారీకేళ కర్పూరారంతులచే సారె

తును పూజా సల్పుదము రారో రమ్మ॥ తిరుపతి శ్రీరామా ... యిదె నిరతామ్ముగాను నిలుపుదము రా రమ్మ.

వ॥ అమ్మయ్యా తెరవెడలివస్తె శృంగారవనము చూపేసంటివే జూపవమ్మా.

చెలికత్తె॥ గీ॥ వనితరో నీవు శృంగారవనముజూడ। నిచ్చ గలిగె నటంచుబల్ ముచ్చటలర।మరియు నినుగొని జనగను మమ్ముబట్టి। చాల పీడించు మీయమ్మ సరసిజాక్షి॥

వ॥ గావున నిన్నుపిలుచుకొనిపోను వెరతుమమ్మా పద్మముఖీ.

ప॥ గీ॥ చెలియ యీకార్యమునకు యీచింత లేల।జనుదటన్నను మాతల్లి ఘనముగాను। అటుల కానిమ్మటంచును ఆమె బల్కు। యెచటవున్నదో జూచివేవేగ రావే॥

ప॥ వ॥ అమ్మా మాతల్లి యెచట వున్నదో చూచిరావమ్మా.

సంధి॥ యీప్రకారంబున పద్మావతి చెలికత్తెలతో చెప్పుచున్నసమయంబున ధరణీదేవి సభాస్థలమునకు వచ్చేవిధం బెట్లనిన.

ధరణీదేవి- తెరపద్యం.

వ॥ అమ్మయ్యా నీ వెవరమ్మా?

వ॥ నేను యెవరైనది తెలియదటమ్మ?

వ॥ తెలియలేదుగదమ్మా?

వ॥ చెప్తాను వినవమ్మా.

క॥ శ్రీగగనరాజునకునే। బాగొప్పగ సతిని యగుచు ప్రబలుదు నేనుఈ రాగనుకార్యంబేమన।భోగవతిదెలిపె దికను వాంఛగవినవే।

తెరవెడలు-దరువు-ఆరభి-ఆట.

దేవిని నేగాదటే లలనధరణిదేవిని నేగాదటే। దేవిని నేగాగ భావించి మదిని సంభావమొందగ పద్మావతీ నీగన్న॥దే। ముద్దుకూతురేమో ముదమున మరి యింతప్రొద్దాయగానమే పొలకువగనిరావె॥దే। తిరుపాతి రాముని నిరతాము మదినెంచి వరతనయను వెతకవచ్చినానేమేటి ॥దే॥

ధా। వ॥ అమ్మయ్యా నీవెంట తిరుగులాడేబిడ్డ నేటిదినం యింత ప్రొద్దు అయిన్నీ నీకు కనబడలేదంటివే యేమమ్మానీ బిడ్డపై భ్రాంతి.

ద॥ వ॥ అమ్మయ్యా అనేకదినములుగా బిడ్డలు లేక చింతించుచుంటిని వకకారణంబు గురించి భూమిని దున్నగా భూమిలో ఒక కమలమందుపుండిన శిశువును బహు గారాబముగా పెంచుతూవుంటి నా ముద్దుకూతురైన పద్మావతి యెచ్చట వున్నదమ్మా.

చె॥ వ॥ నేను పిలుచుకొని వస్తాను తాళవమ్మా.

చె॥ గీ॥ అమ్మ పద్మావతీ నిన్ను మీాయమ్మ యిపుడు। వెంటబెట్టుక రమ్మనుచువేగ నన్ను। బంపగా వచ్చినాను యీాపట్లలేచి। రమ్మపోదాము మరియు మీాయమ్మకడకు॥

ప॥ శీఘ్రంబుగా రావమ్మ.

ప॥ అలాగే పోతాము పదవమ్మా.

శోభాశబ్దమలంకారము-కాంబోజి-ఆ.

పోదాము వేగరాగదే మాయమ్మకడకు ॥పో॥ పోదాము వేగరావే ప్రాణులార మన మీాదాదూరుదు యేమో వాదాడక చెల్పవే॥ పో॥ మీారినప్రేమచేతను మాతల్లికడకుజేరి వేడూకమీారను ధీరతతోడ శృంగారవనమందు నే।చేరి విహరించి యిల్లుచేరె మటంద మిక॥పో॥ తిరుపాతిహరిని వేడుచూ గుంపులుగూడి పదువాడి పాటపాడుచు తరుణీ బొమరిల్లుగట్టి మరి సామిపూజజేశి పదువాడి గొబ్బిదట్టి పాడియాడుదము రారే॥పో॥

ప॥ వ॥ పదిపేలవందనంబులమ్మా తల్లి.

ద॥ వ॥ సుఖముగా వర్ధిల్ల వేబాలా.

ద॥ వ॥ అమ్మా? నాపట్టి, నాసామి, నా బంగారు, యాడికిపోతివే అమ్మా? నిన్ను [illegible]డనిచే నామనస్సు తాళలేదేతల్లి యాడికిపోయి వుంటివమ్మా.

ప॥ వ॥ అమ్మా? మన దాదులతో చేరి ఆట్లాడుతూవుంటినమ్మా.

ద॥ వ॥ అమ్మా? నీముఖము చిన్నబోయి వున్నదేమమ్మా.

ప॥ వ॥ అమ్మా? మన వనానికిపోయి ఆట్లాడుదామని మనసు పుట్టినది మనము బొమ్మలు పెట్టుకొని ఆట్లాడుదామని మనదాదులను యెంతబిలిచినా యెవరున్నూ రాలేదుగదమ్మా.

ద॥ వ॥ అయ్యో కూతురా? ఆవనానికి యిప్పుడు పోకూడదమ్మా.

పద్మా-దర్వు-పున్నాగ-ఆది.

వనమూజూడాగబోదునే అమ్మా అమ్మా అమ్మయ్యా నేనిక॥ వ॥ వనముజూడాగ బోదువని తాలతోడజేరి ఘనముగ ఆటలాడి కడు వాడి వత్తునమ్మా ॥వ॥ వద్దూవద్దని చెలులుపద్మాగ బలుక నిన్ను ముద్దుగ అడిగే శెలవుముదమున యివ్వవమ్మా ॥వ॥ జాతీ పుష్పాములెల్ల నీతితోడులతోశ్రీ ఖ్యాతిగ నిటకుదెత్తు క్రమమున ననుబంపావె ॥ దాటీమీ-రగ బొమ్మలాటాడి తిరుపతి హాటకాంగుని దలచిపూటానే నిటకువత్తు॥

ద॥ కూతురా యేలనమ్మా యింతసుఖము పోకూడదమ్మా తల్లి.

ధర-దర్వు-సావేరి-ఆటతాళం.

తల్లి వినవే అమ్మా వినవే॥ తల్లిదా శృంగారవల్లి యావనము నకు వెళ్లివచ్చెదనంచు వేగిరపడకే నాయమ్మా ॥ త ॥ దాచుక నొక చోట బూచొక్కటున్నది జూచినంతనె పైకి జుర్రున యెగసునే ॥ త ॥ అ॥ పులులు యెలుంగుళ్లు పొదలంచు దాగుండు పులికిపడియుజూడ ఓయని జడిశేవె ॥ త ॥అం॥ బాలారో నీ కిపుడు పూలపై భ్రాంతున్నా మేలుగ దెప్పింతు వెలులకోలది నా ॥తల్లి॥అం॥ ఘనుడగు తిరుపతి యిన కులోత్తము దయ మనకున్నచాలు నావనమున కేగకే ॥ తల్లి ॥ అం ॥

ద॥ వ॥ అమ్మా నీకు యేల్లాటి పుష్పాలు కావలయునో యే పుష్పాలపై భ్రాంతివున్నదో చెప్పవమ్మా తెప్పించి యిస్తాను.

పద్మా॥ గీ। పరగ మన వనము పుష్పజొంపములలోను। అరుదుగాచూడ మరి చిగురుటాకులతోను।పండియున్నట్టి వింతైన పంక్తులతోను। జూడ సొంపగువనమునే జూచి వత్తు॥

వ॥ గావున కటాక్షించి శెలవియ్యుమమ్మా తల్లి.

తల్లి బిడ్డ సంవాదం-శోకరసం.

ముద్దుబాలా దుర్బుద్ధియేలా ముద్దుబాలా యీపద్దు బట్టగను రద్దుల కెడమగు రమణిరో వినునా॥ము॥

పద్మా॥ యేలానమ్మ వినజాలానమ్మ యేలనమ్మ యీలీల బల్కకీబాలచేరి యీవేళబోదు నిక ॥యే॥

ద॥ రంతుజేయ యీవింత యేమనుచు యింతులెల్ల తామెంత నియెంతురె ॥ మా ॥

ప॥ ప్టువిడువ నిక దిట్టముతో నేన్టులయినజని నిపుడె వత్తు నిది ॥ యా ॥

ద॥ ముద్దులమ్మ నీమూర్ఖమేలనే వద్దనంగనిలు వంబుజనేత్రి.

ప॥ ఖ్యాతిమీరం తిరుపతిశౌరియే రీతినైనను న్నింపునర్రోచునే.

ద॥ వ॥ నామాట వినవమ్మ.

ప॥ వ॥ నేను విననమ్మా.

ధ॥ గీ॥ అమ్మ యీమూర్ఖమునకు యేమంనునిన్ను తండ్రి యీమాట వినగనిర్గ దన్నునమ్మ । నాదు పలుకులు విని నలినాక్షి నీవు । యున్న బొమ్మల నిప్పింతు నన్న వినవే ॥

ద॥ వ॥ అమ్మా నీకు కావలసినన్ని బొమ్మలున్ను ఆబొమ్మలకు కావలసినన్ని సొమ్ములున్ను యింకా కావలసిన పువ్వులున్ను తెచ్చిస్తానమ్మ పోవద్దే.

ప॥ వ॥ నాకువద్దమ్మ నేను పోయి రావలెనమ్మా.

తల్లిబిడ్డ-సంవాదం-ఆటతాళం.

ద॥ యేలనే పద్మావతిదేవి యీమూర్ఖ ॥ మే ॥ యేలనేయీ బాలికలతో పూలవనమున కేగకే ॥ యా ॥

ప॥ -యెంత జెప్పినగాని విననమ్మ ఓతల్లి యింతులగు చేమంతి పువ్వుల బంతిగట్టక మాననే ॥ యెం ॥

ద॥ సన్నజాజిలు సంపంగి విరులును పొన్నపొగడలు రోజు మరు వము గన్నెరులు దెప్పింతునే ॥ యా ॥

ప॥ చూడగా మదికి నిచ్చబుట్టెనుతల్లి వేడుకతో జని వేగమె చెలితోడగూడియువత్తునే ॥ యెం ॥

ద॥ కన్నతండ్రి యిది విన్నదండించునె యెన్ని జెప్పినగాని వినకే చిన్నెబన్నాటేలనే ॥ యెం ॥

ప॥ వనమున ఘన పక్షులగనినను మనసుకెంతో సంతసంబని వనితలెల్లను బలికిరే ॥ యెం ॥

ద॥ చిలుకలా కోకిల గోరువంకల కలికియిటు దెప్పింతు చెలులచె అలుకవలదిక మానవే ॥ యా ॥

ప॥ తిరుపతి పురనరహరి నటులెంచి కరుణతో వనదేవపూజలు గాంచి యిటు చనుదెంతునే ॥ యెం ॥

ద॥ వ॥ అమ్మా యీవయస్సులో ఆవనానికి పోకూడదమ్మ నీకు యేమి కావలసియుండినా అన్ని తెప్పించి యిస్తాను నీవు పోవద్దె కూతురా.

అర్ధచెంద్రికలు.

వనముజూచెదనన్న ఓర్వలేరయ్యో । బూచిబూచనిబెదరు బుచ్చెదరేమే । ఘూశిపెట్టుచురచ్చ జేశిరయ్యాయ్యో । శృంగారవనమెపుడు జూతునయ్యాయ్యో । తలపులెల్లనువిఫలతయు నొందెదయ్యో । సారెకునునన్నుజూచి దూరిరయ్యాయ్యో । తోడుచెలులకు నెనరు తోచలేదయ్యో తల్లికిని నాపైన దయలేకపోయె । తిరుపతిరాములకరుణలేదయ్యో॥

ధ॥ వ॥ అమ్మా నీకు యింతదుఃఖము యాలనమ్మా నీవు పోరాదె కూతురా.

ప॥ వ॥ తల్లి నీవు యెంతజెప్పిన వినను పోయివస్తుయున్నానమ్మ.

ద॥ వ॥ అయితె యెంతజెప్పినా వినవు తలనువ్వుకో జడవేసుకో సొమ్ములు ధరియించుకొని పాలుబువ్వ తిని యీచెలులను యేమారక కూడాపోయి కూడానే రావమ్మ.

ప॥ వ॥ ఆలాగే వస్తానమ్మ.

ద॥ వ॥ యెనరే చెలియా యీబిడ్డను వెంటబెట్టుకొనిపోయి జాగ్రతగా పిలుచుకొని రండే చెలియలారా

సంధి॥ యీప్రకారంబున తల్లివద్ద శెలవు తీసుకొని పద్మావతి వనంబునకుబోయి వనమును జూచి వర్ణించు విధంబెట్లనిన.

వనము వర్ణించుట-నాదనామక్రియ-ఆది.

యెంతోవింతగయున్నది వనమిక కాంతరొ యేమనిదెల్పుదునె చెలియ ॥ యెం ॥ పంతమునను వనపక్షులుగూయగ మంతనమునకడు పంతసమాయెనే ॥ యెం ॥ శుకపికకేకలు పకపకకూయగ సొగసుగ

తోచనె సుందరి॥యే॥ బకచక్రవాకాశారికఖగములుగూయ సకలపావుర ములు చక్కగ బలుకగ ॥ యెం ॥ వనితరో యీతటాకవనజములను గన మనమున సంతసమాయనేచెలి॥యెం॥ ఘనముగ తిరుపతి కనకాంబరేశున వనముగయున్నదే వనితరో ॥ యెం ॥

వనవర్ణని-రేగుప్తి-ద్విపద-ఆనంద.

సుదతిరో వినుము యీశృంగారవనము- అది మహావున్నతమై యొప్ప దీనిచూడగా-మది కెంతో సొంపుగాదోచె- చేడెరో వనమున చేరి-యందరము మల్లెలుమొల్లలు-తెల్లకలువలును అల్లియు చేరుంతు లెల్లను-మరియు పలములు కాయలు పక్వంబుతోడ - పలువిధంబుల నున్న యవి కొన్ని కోశి వసంతునికోరి-పూజించి యీసరసిజాక్షుని కందరుకూడి-వరము లడుగుద మమ్మ తిరుపతి రామవరుని-కరుణను పదరె వనజాక్షులారా,

వ॥ అమ్మయ్య యీవృక్షములు వుండే సొగసున్ను యీ తీగెలుయొక్క-యున్నతమున్ను యీపుష్పంబులయొక్క- శృంగారమున్ను అందు ఆఘ్రాణించునట్టి సుగంధపువాసనయున్ను యీభ్రవాలియున్న పుష్పాడిన్ని యీచల్లని మలయానిలయమునకున్ను యీపక్షిజాతుల పలుకులకున్ను, యీతటాకమందలి గల యీపంకేరుహాముల అందముగని యీ వనాన్ని యేమని వర్ణించవచ్చునమ్మ యిట్టిచోట వసంతజయింతులను పూజచేయవలయునుగాన వకబ్రాహ్మణ్ణి పిలుచుకొని రారమ్మ చెలులారా.

చె॥ పిలుచుకొనివచ్చినానమ్మా.

వసంతునిపూజ-ఆరభి-ఆది.

యింతులారా పూజశాయరే వసంతజయింతులాను చాలావేడరే వింతవింతగను వెలదులు గూడుక సంతోషంబున సద్భక్తిని యిక॥యిం॥ వనదేవిని చాలావేడరే మీారందరును ఘనమైనవాము లీడరె వనజనాభునకు వందనమిడుచును మనమున సంతసమొందగ నిప్పుడు ॥యిం॥ యిందీవరాక్షిరావమ్మా దూపదీపము లందముతోడుత తేవమ్మా కుందరదన మనసుందరధరునకు అందముతోడుత వందన

మిడుచూ॥యిం॥ తిరుపతిపురరాముని ధ్యానించి మీారు కరుణచే వర ములిమ్మని పరిపరివిధముల ప్రార్థనజేయుచు శరణని మ్రొక్కరే సర గునరారే॥యిం॥

గీ॥ యీ౧తులెల్లను చేరి వసంతు నిపుడు। వేడరేమమ్మ వడిమీా ర వేడుకలర। వరము లన్నియు తప్పక యొసగునమ్మ। తథ్య మీామా టనమ్ము డీతరుణులారా॥

సంధి॥ యీాప్రకారంబున వనమునందు పద్మావతి చెలులున్ను వసంతునికి పూజచేయుచున్నసమయంబున నారదమహాముని వచ్చే విధం బెటులవలెను.

నారదులవేషం-ఆది-నాదనా.

నారదమునివచ్చెగా కడువడినారదమునివచ్చెగా నారదుండు వీ ణాగానము మరి పారాయణుడై పరువడి నిటకును॥నా॥ వక్షంబున రు ద్రాక్షలు మెరయగపక్షి వాహనుని పదములు బాడుచు॥నా॥

వ॥ నాయనా పద్మావతిదేవి విహరించుచున్నవనం బెక్కడ నున్నదిరా.

వ॥ యెందుకయ్యాస్వామి.

నా॥ వ॥ ఆ మహాతల్లి దరిశనము చేయుటకై వచ్చినానురా నాయనా.

వ॥ యీాదోవనాయనా

వ॥ యిదేనా దారి.

నారదులు-కీర్తన-ఆది-సరళితో.

రామునిభజియించూ నిన్నూ ప్రేమతో రక్షించు ప్రేమనసా ॥రా॥ రాముడు జగదబిరాముడు సంగరభీముడు తిరుపతిధాముండగు శ్రీ॥రా॥ రాముని దలచిన రాజ్యము లబ్బును ప్రేమతో తిరుపతిధా ముడు శ్రీరగు॥రా॥ పామరజాలము పారదోలు మరి వేమరు తిరుపతి నేలెటి శ్రీరగు ॥రా॥

వ॥ పద్మావతిన్ని చెలులుచేరి వకరి కొకరు॥

క॥ ముసలివా డెవ్వడోకాని మోదమునను। పాటబాడుచు గీ

కౌను మీాటిమీాటి । వచ్చుచున్నాడదే చెలివడిగచూడు। యెవ్వడో కాని యతడేల నిటకురాగా॥

వ॥ అదిగోనమ్మా.

ప॥ క॥ నారయబ్రహ్మకు సుతుడౌ నారదమహామాని వచ్చినాడే చెలియా । యారామమునకు నేమో కారణమై వచ్చినాడే కనుగొనలేనె॥

ప॥ పదివేలువందనంబులు స్వామి.

నా॥ సుఖీభవ సుఖీభవ చిరాయుష్మతీభవ శీఘ్రమే వివాహ శిద్ధిర్భవా ధీర్ఘసుమంగళీభవ.

ప॥ వ॥ హేతండ్రి.

నా॥ యే మమ్మాతల్లి.

గీ॥ తండ్రి వినుమయ్య మాయందె దయను చాల।నిటకు జనుదేరుటలు చాల నేను జేయు। సుకృతముగాదు నా కిదే సుదినమయ్యె। నీదు పదపంకజంబులు నేను గనిన॥

వ॥ హే పుణ్యపురుషా యింతదూరంబు యేమిపని కలిగివచ్చినారో ఆనతిమ్మ స్వామి.

నా॥ గీ॥ అమ్మ నినుగని చాలదినంబులయ్యె। నేను విహరించుచున్నంత నిన్నుగనియు। దరిశనం బొనరించుకతరులు దనుచు।వచ్చినాడను వినవమ్మ సచ్చరిత్రి॥

వ॥ అమ్మా? నేను త్రైలోక్యసంచారిణి యగుటంజేసి సంచరించుచున్న నిన్ను దర్శించి పోవలెనని వచ్చినానమ్మా.

వ॥ యిది యేమమ్మా.

ప॥ వ॥ నాయనా యిచ్చట వసంతునికి పూజచేసినాను, బొమ్మరిల్లు కట్టినాను ఆట్లాడుకుంటూవున్నాను నాయనా.

నా॥ వ॥ అమ్మా శీఘ్రంబుగా వివాహం కావలె మొగవాడు రావలెనని కోరినావేమొ శీఘ్రముగా పెండ్లి అవుతుంది లేవమ్మా.

ప॥ నీకు మొగతాళీనాయనా.

నా॥ కాదమ్మ యిదిగో మాంగల్యరేఖ నిన్ను శ్రీశేషాచలపతి వివాహం చేసుకుంటాడు నీ భాగ్యం యేమనిచెప్పవచ్చునమ్మా యి

దిగో దాంపత్యరేఖ యివి లక్షణంగా చిద్రంలేకుండా కలుసుకొని వున్నందుచేత నీవు నీపెనిమిటి చాలా సంతోషముతో వర్ధిల్లగా నుంటారు.

ప॥ నాయనా యెప్పుడు అవుతుందే.

నా॥ యీనెలలోనే అవుతుందమ్మా నేను వచ్చి శానా ఆలశ్య మైనది నేను పోయివస్తానమ్మా.

వ॥ నాయనా యీపండ్లు యీపుష్పములు యీతాంబూలమూ తీసుకోనాయనా.

నా॥ వ॥ తేవమ్మా.

వ॥ నారదుండు చనినతోడనే చెలులందరు గొబ్బిపాడుచు ఆడు చుండేవిధం బెట్లనిన.

గొబ్బి-ఆరభి-ఆది.

గొబ్బియళ్లో గొబ్బియానిపాడరమ్మ కొమ్మలందరుగూడుకొని॥గొ॥ గొబ్బియళ్లో యింతులారరారే మనవసంతుని వేడుదము గొబ్బియళ్లో॥ గొ॥ చిత్తమున వనదేవతులచేరి నిలుపరమ్మయ్య ॥గొ॥ గొ॥ పసుపుచే గొబ్బమ్మ నిచట పరగజేసియుంచరే॥గొ॥ తాంబూలా నారికేళములు తరుణులెల్లాయుంచరే ॥గొ॥ గొ॥ కర్పూరసాంబ్రాణియగరు నేర్పుమీరాయుంచరే॥గొ॥ ॥గొ॥ వనదేవతుల చాలావేడి ఘనవరంబులడుగరే॥ గొ॥ ॥గొ॥ తిరుపతిరాములా దలచి తరుణులెల్ల పాడరే॥గొ॥

వ॥ యీప్రకారంబున చెలులందరుగూడి గొబ్బియాడుచున్న సమయంబున యేనుగవచ్చుటంగాంచి చెలులతో పద్మావతి యిట్లనియె.

రేగుప్తి-ఆట.

వనితరో మదగజ మొచ్చెనదిగోనేచెలి ॥వ॥ మనమునను దబ్బరని అనుకుందువో యేమొగదె ॥వ॥ తెల్లనగు కొమ్ములిదో నల్లనగు మేనుయదో పుల్లాబ్జాక్షిరో బలుపొగురై మన కెదురయ్యెను॥ పొంక ముగజూచి మరల గీంకారము చేయుదాని ఝుంకారమునకు మది జల్లు జల్లుమనెగదె ॥వ॥ యేమిశేయుదు మిక యెవరు దిక్కయ్యెరు ప్రేమ మీరగ తిరుపతిరాముడే ప్రోవవలె॥వ॥

వ॥ అమ్మా యెట్లనే అక్కా యెట్లనే అది కనుబడక వెళ్లెన.

ప॥ క॥ అదిగో తెల్లటిహయమును। అదిగో నొక రౌతుచేరి అటురాపొగ్గె। మదవతి యీవింతలు గన। మదికిక్క బలుదిగులుదోచె మరి యేమందుగ॥

ప॥ వ॥ అమ్మా ముందుగా యేనుగవచ్చె అది యెట్లా పాయెనో పాయను యిప్పుడు యిత డెవరో తెల్లటిగుర్రము నెక్కి సవారి తీరి వస్తూయున్నాడే యిత డెవడో తెలియలేదుగదవే.

పద్మావతి-నాదనామక్రియ-ఆట.

యెవ్వడే యెవ్వడే ప్రాణసఖియా॥యె॥ యెవ్వడో కానితా యివ్విటికినిరాగ జవ్వనియంచక జారుడో చోరుడో॥యె॥ తెల్లగుర్రము పైననల్లనజేరితా నల్లదిగో తిన్నగ నరుగుదెంచెనుచూడు॥యె॥ తిరుపతిరాముని కరుణయుండగ మన కరుదుగ కనపడె కనకాంగి అల్లవాడెవ్వరే ॥యె॥

చె॥ గీ॥ యీతరెనడైతె నేమమ్మ యిందీవరాక్షి। దోవజను వారు లెందరో భావముననుయంచ మనకడ తనచూపుయుంచి యెటుల నేయిదోవచ్చె నేమమ్మ నెలతలారా॥

వ॥ అమ్మయ్యో? చూడండె అనిన చెలికత్తెలకు చూపుచున్న సమయంబున స్వామివారు పద్మావతినింజూచి వర్ణనచేయు విధం బెట్టిదనిన.

స్వామిదర్బా-రూప-ఆనంద-ఆహా యిదేమి అను వర్ణమెట్టు.

యేమివింతరా యీవింతమెరుగరా యీవింతిగనగ మరునిరా దంతిబోలురా ॥ యే ॥ చానమోమురా పూర్ణచంద్రుబోలురా సూనబానుయింటిబాతి సుదతిబొమలురా ॥ యే ॥ వటపలంబురా ఆవనితపె దవిరానిటలముపను గాంచమదికి నీటుగుల్కురా ॥ యే ॥ కంబుకంటిరా నాదంబువిటిరా రంభభాతి తొడలుగలుగు రమణి మెరసెరా ॥ యే ॥ తిరుపతిహరిరా యీతీరుజేసెరా తరుణినేనుగూడకిపుడు తాళజాలరా॥

సంది॥ వ॥ యీప్రకారంబున స్వామివారు పద్మావతిమీద మోహభ్రాంతిచేత శృంగారవనమందు పద్మావతిసమీపంబున కరగి చెలికత్తెలంజూచి యాలవేయువిధం బెట్టిదనిన.

స్వామి-చెలికత్తెలు-సంవాదం-రేగుప్తి-ఆట.

స్వా॥ పొలతూలార యిపుడూ మీరు పూజా చేయుచున్న మరి నీ యిలువేల్పుదైవా మెవ్వారె ఓసఖియూలారా కులుకుచూను నాతో దెలుపారె.

చె॥ యేదైవామైతే నీకేమి యెవరిని గొలచితె నీకేమి వాదులాడ యిటకు వస్తీవా ఓబోయవాడ నీదుజాడబట్టి వెళ్లారా.

స్వా॥ బోయూవాని కానేభామ ఆపొలతికై వచ్చీనమేటి వాయకాడ ననుచు నెరుగావె ఓకన్యలార నాయెడదయబూని పలుకారె.

చె॥ రాజితంబౌ తిరుపాతిశ్రీ రామూనిదలచుచునుండ రాచ వారిచెంతచేరకు ఓబోయవాడా రాణివాస మిటుల రాకురా.

వ॥ వరె బోయవాడ యిచ్చట రాణివాసము రాచకన్నెలు వుండేస్థళం యిచ్చట రాకూడదుపోరా.

స్వా॥ వ॥ ఓయబ్బో నేనున్ను రాచవాణ్ణె మనకు మనకు యేమిరాణివాసమె భామా వకసమాచారం యెట్లంటె.

స్వా॥ గీ॥ నన్నుగాంచిన యాచిన్నదెవతొ । చాటునకు దాగియున్న దాచాన నిపుడు। గనక యున్నను యికముందు గాంచగలను। రాణివాసంబు మనకేల రాజవదరా॥

వ॥ అయితే చిన్నదానా యిపుడు చూడకపోయినా యికమీద నైనా జూడనా ఆచిన్నదానితో కొంచం వకమాట మాట్లాడవలెను. కొంచం రమ్మనేమి.

పద్మా॥ ఓయమ్మా యిది యేమివింత యెంతమదుకమ్మా అని మరియు పద్మావతి యిట్లనియె.

ఆట-నాద-ఆశ్చర్యం.

యెంతమదుకే యీ మొగవాని కెంతమదుకే యెంతమదు కమ్మ వీడెంతటివాడమ్మ యింతి తన కెదురుగ యిటుల రమ్మని బలికె ॥యెం॥ యేవ్వారో యేవారో యెందులకేగెడో సావధానముగాను సఖియరో. యదుగ వె॥యెం॥ తల్లి జెప్పిన బుద్ధి తలపోయగను గుండె జల్లు మనెను యీాల చనుదెంచితిమెకొమ్మా॥ లలనరో యిత డెంతో లక్ష్య పెట్టక

నన్ను పలుకు పలుకుమని బతిమాలె సాకార॥మొం॥ తిరుపతిహరిమెచ్చ తీవ్రతమీరగ యరుదేసుదమురారె యలనాగ నతనికి ॥మొం॥

వ॥ అమ్మయ్యా వనానికి వచ్చినందుకు యీఫలముచాలు వాడు మొగవాడు అని చలాయించుకొంటాడు మనము యేమైనా అంటి మా మోసము వచ్చునుపదండే.

స్వామి॥ హేచిన్నదాన యిటుచూడవే.

స్వామి-నీసార్థం-రేగుప్తిరాగం-ఆదితాళం.

సుందరీ నీదగు యింద్రుని సమమోహముజూచి జూచియు చాల సొక్కి సొక్కి మదన బాణాగ్నిచే మరి మోహామున నిన్ను చూచెద నన్నికా చూడనియవే చిలుకాలకొలికి నాతో తళుకు మోముటుజూపి చిలుకా పలుకూలు బల్కవే నాపైన నెనరు పలుమారు చాల జిల్కవే కులుకులాడి నిను కోరిరాగ యిటు పలుకు పలుకకను పదరుచు కన రేవు చిలుకా.

ప॥ సీ॥ నీవెవ్వడవుకోరి నీచపు పలుకులు పలుకుచా [illegible] నాతో పలుకు టేల। నాసుందరంబున్న నాకుండ నిమ్మని నిన్నెవరు।పొగడంగ దె లిపితిరి యేమివింత। వేటాడునట్టి బోయ [illegible] వేటాడబోవు మాజోలి నీ కేల పొమ్మిరా నీమందబుద్ధినూలి పోకున్నజిమ్మెరా। యిమ్ముగ సొంతగా ని యెమ్మెలు బన్నిన హింమ్మాహింమ్మావారు గుమ్మెరాటకుపోపోజోలె ॥

స్వా॥ గీ॥ స్వాంతగానినిగాన సుందరీ నినుగని విరహవేదనకు సహించలేక మదనకేళినిగూడ మనుసాయనసగను। కోపమేలజేయుకుం దరవదన యిటురమ్మా।సంపంగిపూలనెమ్మ నీలసుధరమాన నిమ్మ। కౌగిట జేర్చుకొమ్మా।రమ్మురమ్మమోహంబున యదయద। గుమ్మనియ్యవె కులుకు లాడి యిటురమ్మా॥

ప॥ గీ॥ మాటికిటుబల్కకికను నీనోటికొలది విడిము శేయ రచూడుమావేగ।మిపుదు కట్టి కొట్టింతు నెట్టింతు పట్టి నిన్ను। ద్రొట్టు డై వచ్చు దారిని తెగువమీర పోగాడా। మామాట లేలమూఢ విపన విహారరేడా శిక్షింతురు నిన్నుజూడా। వినకోరిబోయవాడ పోపోర

వచ్చినజాడా । నేడు నాడు బలునేస్తుని వగదిని వేడుకలనే యెర్రి చేమనందీడా ॥ మా ॥

స్వా॥ కందా॥ వనితా నన్నెవడనుకొని మనమునయెంచితివో పన్ను మరియాదలచే । ఘనముగ బిలువకబోయుండనియెడవె యెంత యెర్రిదానవేభామా । నేటికి నిన్ను మానానలేమా। వేమారు కౌగిటవేగమె జేర్చి। నీమోము మోముగదించి ముద్దిస్తుగద వెర్రిదానవెభామా॥

ప॥ కం॥ పోరాపోరాయనునీ శూరతయనుమాట। లెన్నొ శుద్ధిగ దెల్పవేరా జారాచోరాధీరత నీకెంత చెంతజేరాకుపోరా। మావారు వచ్చేరు లేలేరా। మీరీనమాటలు చేరి పలికిన నిన్ను కోరికలూర నీ కొవ్వణగించెద చేరాకుపోరా॥

స్వా। కందా॥ వైకుంఠవాసుడేనని నీకుం దెలియంగలేని నీ మూర్ఖంబుగా జోక।తో నేమని దెలుపుదు ఆకరివరదుడనుగాని అతివరో । తెలియంగలేవె మతివరో సతినగు నాకును సంశయమిడకను పతినీకయ్యెద భావింపుమునగ నతివరో॥

క॥ ఆకాశనృపతికినినే ప్రాకటముగ భువినిబుట్టి ప్రాజ్ఞులు మెచ్చగ। నన్నును శ్రీహరి కొసగియు యేకముతో। పెండ్లిజేయు బెనుగవె కసరినగాని యెరుగవె మరుగు మరుగుననుమరి మరి జేరిన తిరిగి తిరిగినను తరుముటతగదే॥యె॥

స్వా॥ క॥ మరి విను నాకులగోత్రం బరుదుగనే విన్నవింతు।అబలా నీకుగ పరవానిగజూడకు మిక। సరసిజదళనేత్రి నిన్ను సన్నుతింపు। దునే నాతెరగెల్ల విన్నవింపుదునే।దంతిగ మన నాకైదరనుబుట్టితివీవు। యింతిరో నిన్ననే నేల బుట్టితినన్ని.

క॥ నీకులమును గోత్రంబును నీకునుగల బంధుజనులు నీతలితండ్రుల్। నీకును గల పెద్దిరెము నాకెరుగింపుము వినంగ।నయగుణశీలా నీపైనా సందియమేలా చాలా। యేలీలవర్తింతు యేలీలచరియింతు। యేలీల నిచ్చోటికేలా రాగను దెల్పు ॥ నయ ॥

స్వా। క॥ యిందుముఖి వినవె దెలిపెద చంద్రునివంశంబుమాది। చాలగ వినుమో సుందరి వశిష్టగోత్రంబంధబుగ। పేరు నారాయణుడే

ఓభామ యికనైన నన్నేలవే ప్రేమా। వేమారు వసుదేవదేవకి తలితం డ్రులేమారకను నాకు భక్తులైయున్నారు ॥ నారాయణుడే ॥

పద్మా॥ వ॥ అనిన చెలులతో వీడెవడమ్మా.

నాదనామక్రియ-ఆది.

దొంగవాడే యిత డెవడో కాని॥దొం॥ దొంగవాడు యీనంగి తనముచే సంగతి గనుగొని సైగలుజేసె ॥దొం॥ టక్కుమాట లిటు పెక్కులు బేలుచు పక్కజేర మనె నక్కట యితడు ॥దొం॥ బంధువ నుచు ననుబలిమాలుచు సంబంధము సాయవే సఖియరోయననే ॥దొం॥ ఝుడియక మీరలు వడినిరాళ్లగొని తడబడవిసర రెతరుణులుగూడుక ॥దొం॥ తిరుపతిరాముల కరుణను యింటను మరి దెల్పకుడికి మగువరో యితడూ ॥దొం॥

స్వామి-పద్మా-సంవాదం-ఆది-ఆరభి.

కలికిరో దొంగవాని కానెముగ్దులభామకానె॥ యిలయేడుపర్వ తాలు నేలేటివాణ్ణి॥

ప॥ పదరాకు తండ్రిచేత పట్టికొట్టింతు నిన్ను ॥ప॥ వదలకముం దు నిలిచి వదురుటయేలా॥

స్వా॥ చానారో నేబ్రహ్మచారినైతినెకన్య॥చా॥ కన్యదానమూ నటుల యిపుడు దయచేయవేమే॥

వ॥ పట్టికొట్టింతుచూడు భయపడ నెన్నడైన ॥ భ ॥ నెట్టింతు మెడబట్టి దిట్టింతుచూడు॥

స్వా॥ కొట్టితిట్టిన నీవే కొట్టవెచేతికొలది ॥కొ॥ ఆమట్టునకైనాను పుణ్యమయ్యని నీకు॥

పద్మా॥ తిరుపాతిహరితో చెప్పి తరుణులందరుగూడి॥త॥తరిమితరి మి లెస్స తరిగింతుచూడు॥

స్వా॥ వ॥ హేవనితా మెన్నాళ్లు బ్రతికినా వకనాటికి చావవల సినది నిశ్చయము గనుక నీ సౌఖ్యముకోరి వచ్చినాను నేను బ్రహ్మచా రిని నాకు నీకన్యాదానంబుచేసి నావ్రతము తీరినతరువాత చచ్చినామేలే లేక బ్రతికినామేలే.

పద్మా॥ వ॥ వరేవరే దొంగా యేమంటివిరా యీసారి అనరా.

స్వా॥ వ॥ హేభామ నేను నల్లగా యున్నానని నన్ను దొంగ అంటావా నేను కృష్ణపక్షచతుర్దశినాడు అర్ధరాత్రివేళ పుట్టితిని గనుక నా దేహము శ్యామలవర్ణము అయినదేకాని నేను దొంగనుకానేభామా.

ప॥ అమ్మా.

గీ॥ అక్కరో వీనుటక్కులమారిగాక। మదినియుంచుము మొగమాట మటులబెట్టి। చేతిశిలలచే రువ్వెడిమీరు వీని। నేలగూలంగ విసరరే నెలతులారా॥

వ॥ అమ్మా తలావకరాయి రువ్వండే రువ్వండే.

సంధి॥ యిట్లు రాళ్లు రువ్వినను హరితాళలేక పరువిడినచెలులు నవ్వుచున్నసమయంబున పద్మావతి యిట్లనియె.

దేవగాంధారి-ఆది.

పురికెనుగా తనుణులకెరచి॥ పు॥ పురికెను గదమొగ బిరుసుగ లుగుదొంతనుణులగూడుక తగుపనిశాయగ॥ పు॥ గుర్రముగిర్రము ఘుంభినిగూలగ విర్రవీగ కనువెరచియు బిరబిర ॥ పు॥ శిలవర్షంబియిలగురిపింపగ కలకపక్షియు తానలుకుచు బిరబిర ॥ పు॥ యింతిరో తిరుపతి యినకులచంద్రుడు యింతుల పనులకు సంతసమొందగ॥ పు॥

వ॥ యిట్లు పురికిన.

ప॥ గీ॥ యెంతజెప్పిన వినకనుపంతమునను। తల్లి నటువిడనాడి యిటకును వెళ్లినట్టి। పలుకు చాలింక పదరమ్మ పణతులార। యింటికిని జనుదమమ్మ వాల్గంటులారా॥

ప॥ వ॥ అమ్మా? అడుగుమెత్తి పెట్టలేనుగదమ్మా.

చె॥ వ॥ యెందుకమ్మా.

ప-సీసార్ధం-ఆదితా-శోక.

రాళ్లురువ్వినమహారాజవ్వడోకాని। వానిపైనాకే మొవాంచబుట్టె నేరమెంచుచుచాలనేనేలబల్కితి। తప్పెంచయుమరితగువుకేక్షి। రచ్చలుకేసనరమణివానిపైమరులుబుట్టితాళగలేస। అమ్మయ్యయింకనెటులో

ర్వగలనె దిట్టాముతోడ వానితిట్టిపొమ్మనగనమ్మ। యెటులైతు నే విరహామే
లాగునణతునమ్మ బుట్టితా॥

గీ॥ వాని మోమును జూడలేని మోహము బుట్టె ఆదేహమాసుంద
రావనంబు। ఆకన్నులా చిన్నెలా నోరు యాశౌరు నాకాళ్లు నావేళ్ల నతనివి
భవ మేమందు రాజతివిమెం తానివర్ణింతు నేలాగు నోర్చుకొందునే। వాని
పై మరులు వేమారు మరచియుందునే యిందువదన వానినెందు కొవిడనాడి।
మందబుద్ధిని దిట్టి మదమున కసరితిమె నేలాగు॥

వ॥ మరియు నాపద్మావతి విరహవేదన చెందుచున్న సమయంబున
మన్మథుడు వచ్చినఁ జూచి యిట్లనియె.

మన్మథభూషణ-నాటరాగం-భయంకరరసం.

ప॥ గీ॥ యిదిగో యిదే సందడటంచు నామదను డిపుడు। పొగరుచి
లుకను జేరితా తెగువమీర। నాపయిఁ దండుతో నెత్తినాడు చూడు। పైస
మెయిటుల వచ్చె నే పంకజాక్షి॥

క॥ చందనగంధిరో మారుడు। అందంబున చిలుక పైపునం మనభేరిఁ।
డం డం ఘణ దం దం దణ। దం దం దన యనగ వచ్చె తరుణిరో వినవె॥

శా॥ అదిగో నే పొగరైన చిలుకహాయముఁ న్నందంబుగా నెక్కి-
తా మదనుండా పికకేకలావృకశిలుఁ మత్తేబసమూహంసముల్ ముదముఁ
శారికపారముఁ వడిగాఁ ముందుఁ నటింపంగగఁ కదనంబింకను జేయ
గాను వెకలెఁ కలకంఠి యిటు చూడవే।

దరువు-మోహన-ఆదితా.

అదిగో మన్మథుడొచ్చెనమ్మ ఓ చెలియలారా॥ అ॥ అదిగో మన్మ
థు డస్త్రములను తాకుమరుగ పైపునకదియుచు గట్టిక॥ అ॥ చిలుకాపై
స్వారి వెడలినాడు పొగరైనయొక్క- చిలుకాపై భేరి వేశినాడు కలకలమని
చిలుకలు రొదశాయగ ములుకుల భాణము ముదమున వేయుచు॥ అ॥ తిరు
పాతిరాములాకు సుతుడై తనమీసములు మరిమరి దీడుచు చాలఘనుడై
అరుమగ శరములు యురమున నుడిగొని బిరబిర వేయుచు తరుణిరో- అల్ల
దిగో మన్మధుడొచ్చెనమ్మ॥

గీ॥ శరణు శ్రీవారాశికుమార శరణు శరణు। శరణు రతిసతిపతి గోడు

శరణుశరణు॥ శరణుశంబరదనుజారిశరణుశరణు । శరణు జేసుకవినుపింతు శాంతితోడ॥

క॥ శరణనిజొచ్చినవారిని కరుణతో రక్షింతువనుచుకటిటి వింటిటి।పరిపరివిధముల నిను నేశరణన్నను బ్రోవవేరచక్రిసుపాత్రా॥

ఉ॥ దంధణధంధణుంధణుతదంధణదంయనిభేరిమ్రోయగా। బంధురడంకడక్కిముకిబొంకకు తారమితారి మీరగశ్యంధనమంను జేరి మరి శారికతుమ్మెదకీరరావముల్।సందడిజేయుచుండ మిగుల సారసబాణుఖరాతుడొచ్చనే॥

ధర్మారు-వినయరసం-ఆట.

మదనవినరయీకదనమేలరతంద్రి మదనకదనశాయమానరయా నరమదనయదనా నగవేయకుకోరి॥మ॥సారెకుశరములుసంధించి వేయుటయేరా ధీరా మారా వినకోరి ॥మ॥ సతతామునిన్ను నానుతుడానిమది నెన్నితిరా రతిరాజతిచలమేలర ॥మ॥ కన్నెనౌనన్నేచగానుపతితముగదరన్నా అన్నానన్నాధరిరిచర వలరాజనిన్ను నేవద్దికతో వేడచలమా పలమా బలమానిలుకోరి ॥మ॥ సతతాముతిసపతిసరసిజాక్షుని నమ్మసతిరాబతిమాలితిరారతిరాజ ॥మ॥

వ॥ అమ్మయ్యా.

క॥ బండనమునపోరగవశిదండదసంపగదివచ్చుదైర్యమునను । కోదండంబునశరములనిడగాండీవిసమానుబోరుగాయితమనఘ॥

కందార్ధం-ఆట.

నారిటిశరములుజేర్చి నిశారిటియగపడిచివాడిశరమేయకుయా శౌరిటిగరుడవిహారిటి శౌరిటినేగూడినపతుశరమిడవన్నా నీవడిబయలు పరచరాయన్నా అన్నావినరనేనుకన్నతల్లికిసాటి యన్నాగనశరమేయగ తగునటరన్నా ॥మ॥

తరువోజ॥ నందనందననందనం దీనికిదియందమా నీచందమా మందమానలనుండపై శరమందివేయుటలందమా చందమామాచంద మనగచ్ఛందమునమెదురించి మామందపై మీరందరిటుబడి కుందజేయుటన్యాయమా॥

పద్మా-దర్వు-మధ్యమావతి-ఆట-వినయరసం.

వలదురా నాతో వలరాజ యీచలము వలదురా యీచలము నాతోవనితయూ నన్నేలరా॥ వ॥ అబ్బబ్బా యీదెబ్బలకోర్వరగబ్బిగుబ్బలునదరవేశినవిబ్బరించకలేనుగా ॥వ॥ తనయుడై యింత తామసమేలర తనయుడై మరితల్లి నేచినఘనతకునుమరిహానిరా॥వ॥ వద్దురాయిట్టిపద్దులు నాతోడ వద్దువద్దుర ముద్దుతనయుడ రద్దుశేయగనేలరా॥వ॥ వంటినున్న వాల్గంటిపై శూరతకంటవచ్చినబూజనుల్ నినుతుంటుడనిధూషించరే॥ వ॥తిరుపతిపురనరహరి కరుణచేవరునిగూడి సుఖించేటివరకు దయతో తాళరా॥వలదురా॥

వ॥ యిట్లు వేడుకున్న.

చంద్రదూషణం.

గీ॥ మానినీమణిచంద్రుడుమత్సరమున। నేప్పననుజూడతావచ్చె తూర్పుదిశను।సమయమాపీనికీరీతిచలముబూన। యేమినందునుచంద్రుని ధీమసంబూ॥

నాదన-ఆది-ఏక.

యింతచలముశాయనీకుయేలర నేబాలర పంతమిపుడుజూపరా ఘపంకజాక్షతాళరా రంతువేలరయింతులజేరియు వింతనాచెంతనుపంతముబూనుట॥యి॥విరహాగరితచెంతజేరి వింతబన్నుటేలరా తరుముగాదు యీవరకువెన్నెలచురుకుబల్కరుకునవరకురాకురకర ॥యిం॥ ధరనుతిరుపతిపురనరహరినినమ్మ్రదానరా కరుణాచేనావరునినేగూడినతరనినీవడిధర నిరతముజూపర ॥యిం॥

క॥ చంద్రావినుయిటుగాయగ యందనునుగుణంబుమానిఅల్పుండైనవిందురాతగునయిప్పుడు। కుందశరునితోడుగూడి కొంకకుచంద్రా॥

సీ॥ గురుభార్యనటుగూడిగురునిచేశాపంబు।గొన్ననీకునుశిగ్గుయున్నదటర మానంటిగరితలమరిమరియేచుచుదూషణాలందేటిద్రోహినీవు। జక్కవలటుజేరిపక్కబాయకనున్నయెడబాపినట్టిపాపుడవునీవు।తోడబుట్టినుచాలతొందరపరచిన ఖర్మాత్ముడవు బ్రోవగలవెవన్ను।మేనువేకనుచరియించున మేనమామ అల్పుడై కళలుతగ్గిన అల్లుడీవు।మామ అల్లుని మర్యాద మదినినెంచ త్రాసునసుతూగి నటులయ్యెద్రోసకారి॥

దర్వు-శ్రీరాగం-ఆది-ఆట-రూపకం-యేక-ధృవ-౫ తాళములు.

చందమామచందమామ చందమామచందమామ చందమామ యిటుచలమునగాయగనంనుగాదురాసై చరపూర్ణ ॥చం॥ కందెమేనుత మినెంతెయికనుయేమంనునిన్ను యీమత్సరమేలరా చ॥ శ్రీవేమతిరుపతిని రాముకృపనునిను వేమరిటులమదివేడెదపూర్ణ ॥చం॥

సంది॥ వ॥ యీప్రకారంబున యీపద్మావతి మదనకాకను తాళ లేక మూర్ఛిల్లిలేచి పూర్ణజ్ఞానంబున తాను గన్నపురుషునిమనంబున తలచి యిల్లనియె.

దర్వు-పున్నాగవరాళి-ఆదితాళం-దుఃఖరసం.

దేవాహాయాదేవదేవమహానుభావా॥దే॥ దేవానీపై నాభావముం చిరనీవేదోవనుబోతివృభావజసమరుహా॥దే॥ సూనాస్త్రుడిప్పుడుబాణము వేయనా మేనుఘోరువదయ్యో యేమిసేయుదునింక ॥దే॥ నీముద్దుమో మునునీదివ్యదేహము నీదుసుందరపు పలుకులెపుడువింనుగానీ ॥దే॥ అందముతోడనాముందుగనిలచియు ఆనందముతోనెపుడుఆదరింతువు కాని కులుకుచు లేనయమెలుకుచు నీముద్దుపలుకు లెపుడు నాతో బాషిం తువుగాని॥దే॥ యెపుడు కనుగొందును యెపుడు సేవింతును యెపుడు కౌగిటజేర్చియేను సుఖంతును॥దే॥ అనగరానట్టిమాటలాడితినని కోప మునను నాతోడుతముచ్చటలాడవు॥దే॥ ధరనుశ్రీతిరుపతిధాముడౌ యీ రఘువరునికరుణను నిన్ను మరులుగొందును యెరుగదే॥

సీసార్ధం-ఆది.

ఆసుందరాంగుని ఆముద్దుసామిని ఆయందగానిని యేగలవన్ను నెన్నడుజూతునో నెపుడుభాషింతునో ముందేలబోవ్మంటిమూర్ఖమును నను మదనతియీవనమందు వెతకియువాని ముచ్చటలాడవచ్చునే గౌగి టజేర్చి గ్రుచ్చిలాలింపవచ్చునే మచ్చకంటిరో నన్నుమరులు బుట్టించి తాను యెచ్చోటదాగినాడో అచ్చోటవెతుకరమ్మ ॥యే॥

సీ॥ చేడెరో వినవేయాకోడెగానిని గూడకేతాళలేనమ్మ యిందు వదన ఆతని నాకనులతోనతిమోదమునగనక ఘుడిగైనయోర్వనేకమల నేత్రి అతనిటుతోడితేవే అతివా వానిపై మోహావేమానివర్ణింతునే

గనగనే అతని సేమూరు సన్నుతింతునే। బ్రహ్మమహాదేవ యని యొరశిపట్టు కవాని సామి యనుచు పాద। సేవ జేయుచునుందు॥యే॥

సే॥- మానినీ వినుయామహానుభావునిగన్న।ఆలంగనాది చుంబనములోఁడ సారెసారెకు పెనగిచయ్యన బగబట్టి సూనాస్త్రుకేళిని బొరగజేసి హరిణాక్షి దనరు పద్మనాగరబ్బ బంధముల। నతనిగూడుచు మొత్తునే।మరి మరి బాళితగలి గూడక బోనిత్తునే బత్తరి వినవె యపుడు వేలనె రాళ్ల చేత।లతర ముంద శాయదయమాలినాడారాడా॥యే॥

కందార్థం-రేకు స్తి-ఆది.

అప్పు డీ తెలివిమాలియు తప్పక దూషించి యతని తరుణుల చేతఁ। గుప్పిరచిరాళ్లు మరి నే।నిప్పుడు, చింతించుటాయె నెలతరో।యటుజేయకున్నవలతురో।దలచి దలచి చింతలు నురియక యీ।కలకను డీర్ఘెటి ఘనులెవ్వారే॥ నె॥

-చె॥ వ॥ అమ్మమ్మా అతను బోయవాడా యెరుకలవాడా యింత భ్రమయేలనమ్మా.

కం॥ యెరుకలవాడునుగాడే। వరుసగ పరికింపబోయవాడును గాడే। మరి మరి నన్నేలెటిగన పురుషుండై యిటకువచ్చె పూబోణీ వినవే। ఆసుందరా పొంకమునకనె మనమున యాగనుని మరతునన్నను మరువవనితరో-నతనిపై భ్రాంతి గలిగెనె ముద్దు॥ ॥పూ॥

కం॥ నన్నేలువాడు గాగనె కన్నెరొనగుగూడు నునుచు కరుణలో బలికెనె। యన్నగ మదికిని బోయల చిన్నెలుగా దోఁచలేదె చెలియరో వినవే గడచినవనికి చింతైలగనవె। కనకాంగి వినుము దూఘనునిజూడకగాని। జనగ విూవెంబడి చాల యింటికిరానే॥పూ॥

చె॥ యేమమ్మా యీభ్రాంతి యింటికి పోదాము పదపదమ్మా.

వ॥ అమ్మయ్యా యీవనములో యీవన్నెకానిని వెతకిచూచి మాట్లాడనిదే నేనురాను గనుక యీవనములో ఆమహానుభావుని చూడరమ్మా.

ఆట-శ్రీరాగం-వినయరసం.

చూడరే ఆపాదలమాటున్నాడో ॥చూ॥ చూడరె మన పాలి సుందరరూపుని చెడెనాకగు మంచి కోడెకాడెవాడు చూడరె పడతి

రో మన మల్ల భ్రమయింపగా వనదదుల జేమక చాలదాగినాడో యే మొ॥చూ॥ అడుగులజాడ వెంబడిగాను జని వాని పడతులార పోవిడి గాంచిరా రేమి॥చూ॥ అల్లదిగో నచటేమొ తెల్లగ నగుపడె పిల్లనెగని రమ్ము పుల్లాబ్జాక్షిరో వాని॥చూ॥ తిరుపతిరాముల కరుణను యాఘన పురుషుని గన నిపు డేఘురు కొల్పుదుగాని॥చూ॥

వ॥ ఆపొదలమాటున.

చె॥ అతను మెచ్చటగానము మనము పోదాము పదవమ్మా.

ప॥ వ॥ నేను రానమ్మా.

సంధి॥ యీప్రకారంబున పద్మావతి విరహావేదన జెందుచు న్నసమయంబున చెలులువచ్చి ధరణిదేవితో యిట్లనియె.

చె॥ వ॥ పదివేలువందనములమ్మా తల్లీ.

ధ॥ వ॥ సుఖంబుగా నుండవే చెలియా యేమమ్మా మీరందరు పద్మావతిని వనమునకు పిలుచుకొనిపోతిరే యావత్తుమంది సుఖముగా యిల్లుచేరినారా.

చె॥ సీ॥ అమ్మ నీచే సెలవ్యొంది యందరమును।వనముచజేరియు వనరుమీర। వింతగా మరి యావసంతుని పూజించి యాడి పాడుచు నున్న యెంతలోన నారదుం డరుదేరి నాతని పూజింప నతడు నేంచే యనుద్దండమైన కలభ మొక్కటి మాకు కనుపించినంతలో మాయమై పోయిన మరియు కొంత। తరవునకు తెల్లగుర్రముకో వడిగనెక్కి నొక్కఁ బోయుండు యురు దెంచి వడిగి నీసుకుమారుతుకుం గని యేమేమొ నీతు లెల్ల జెప్పి చనినది మొదలు యీచెలియవాని॥

క॥ దలచుచు మోహంబున మది। వలచియు నాఘనుని పైన వాయువలతో డనే పిలచినమారైై అలుకచె।పలుకదు యేమందు దృష్టి భానమొ యెరుగనే॥

వ॥ అతన్ని చూచినది మొదలు పిలచినా పలుకదు మాట్లా డదు దయ్యమో బూతమో భయపడినదో కనుదిష్టియో యిదిగో నీ కొమారైను దెచ్చినాము చూచుకోవమ్మా తల్లి.

వ॥ అనిన ధరణీదేవి పద్మావతింజూచి యిట్లనియె.

ఆట-శ్రీరాగం.

పలుకవే నే నెంత బిలిచినగాని॥ప॥ పలుకవె పిలిచిన యెలుకచే నున్నావు తలిరాకుబోణి నీతల్లినిగాన జే॥ప॥ బువ్వతిందువు లేవే పాల తియనుచు బిల్వ రవ్వలు జేశేవు నవ్వుచు నాతోను॥ప॥ పాలు మీగడ మంచిపాయసాన్నము బువ్వ చాలా మెక్కుడనపని చానరో నమ్మితి॥ ప॥ యెంత బిలిచిన తిరుపతీశుని దయచేత వంతగించక నాతో పలుక కయున్నావు॥ప॥

గీ॥ ము॥ యేమె ముద్దులగుమ్మ యీయుంతలెల్ల। నిన్ను కొట్టిగో తిట్టిరో నిజముగాను। దెలుపు మిప్పుడె వేవేగ తెగువమీర। శిక్ష జేసెదవారిని సిద్ధమిదియు॥

గీ॥ యెంత బిలిచిన నెనరుసుమంత లేక। యెన్ని బంగుల పలుకవదేమి నంగలేక। యీమూర్ఛ మిటులేయ నాకు తెలుసు।నటవె నా యమ్మ నాకూననాదు పట్టి॥

వ॥ అమ్మయ్యా బువ్వ తింటువు లేవే కొండకా॥

ముఖారి-ఆది.

నిను యెవ్వ రేమనిరే పద్మావతిదేవి యింత కనరభే నాపైన పద్మావతిదేవి॥కన్నీరుంచు లేలనెవ॥ప॥ నాతో యున్నరీతి దెలుపవె పద్మావతిదేవి॥ పవ్వళించియున్నా లేపిన నవ్వుచు లేతువుగదె పద్మావతిదేవి॥ దడిసియున్నా దెలుపవె॥ప॥ రక్షవడిమీఁర కట్టింతు పద్మావతిదేవి॥ మాటాడవేలనె పద్మావతిదేవి నాతో తేటగా దెలుపవే॥ప॥ నీతల్లి నేనైతినె॥వ॥ యిపుడు నాతో దెలుపవమ్మ పద్మావతిదేవి॥తిరుపతిహరిమెచ్చ॥ ప॥ నాతో మరుగు లేక దెలుపవె పద్మావతిదేవి॥

వ॥ అమ్మయ్యా మంత్రించండే రక్షకట్టండే యెవనీళ్లు తియ్యండే అమ్మా యిది ఫలానిది అని తెలియదు దీని తండ్రి వింటే నన్ను యేమనునో నేనేమిసేతునమ్మా

ధరణి-దర్వు-పున్నాగ-ఆట.

యిది యేమొవింతా యిప్పుడు నామదికేమొ చింతా యిది యేమివింతమ్మ యిది యేమిమాయమొ వదలక కదలక మెదలకయే

న్నది॥యి॥ మంత్రతంత్రములెల్ల మరి మరి గావింప యింతిరో యిది యేమో హెచ్చగుచున్నది॥యి॥ రక్షగట్టించితిరమణిరో యెంచగ పక్షి వాహానుడౌ తిరుపతిశౌరి దయలేదె॥యి॥

వ॥ అమ్మయ్యా యెంత బిలిచినా పలుకలేదు కండ్లవెంటనూ త్రము నీళ్లు వస్తూవున్నది. పిలిచితే యేమో పలుకలేదు యీలా టిరోగము యెచ్చోట జూడలేదమ్మ యిది యేమి ఆశ్చర్యమో.

వ॥ అమ్మా పద్మావతి వనానికి పోతివే కొడకా అచ్చట యేమి సమాచారం నేను నీతల్లిని నీవు నాబిడ్డవు నాతో చెప్పక యిక యెవరి తో చెప్పతావు కొడకా నీయిష్టప్రకారం నడుచుకుంటాను తల్లి.

వ॥ యీప్రకారంబున ధరణీదేవి పద్మావతినిజూచి దుఃఖింపు చున్నసమయంబున నారదుండు వచ్చువిధం బెట్టనిన.

నార-మధ్య-ఆది.

హరినారాయణబ్రోవవే శ్రీ॥ హరిహరియని నిన్ను స్మరణయు జేసి దురితములనుపో దోలేటి హరినీవే॥హ॥ భక్తులెల్ల నీభజన శేయ గాను ముక్తి నొసంగేటి మురళిధరుండవు॥హ॥ తిరుపతిహరి యని మరి మరి దలచిన అరయగ ధనధాన్యము నొసగెడహరి॥హ॥

ధ॥ పదివేలువందనములుస్వామి.

నా॥ సుఖంబుగా వర్ధిల్లవమ్మాధరణీ.

ధ॥ యేమి సుఖంబుస్వామి జూడండి.

నా॥ యేమమ్మా యేమిసంగతి.

వ॥ గీ॥ దేవయొకనాడు చెలులతో దివ్యమునను। నాడు ముద్దు కొమారితె నయముతోడ। వనవిహారము చేయగా వాంచబుట్టి నన్ను వేడుచునున్న నే నంతలోన॥

దర్బా-పున్నాగ-ఆట.

అంటినీ పోవద్దంటినీ యీకుందరదనతో॥అం॥అంటిని పోవద్దం టని నేననుచునుండగ పోరు బెట్టియు వెంట చెలులనుగూర్చి పంపన ట్లంట నాతో పలుకుచుండగ॥అం॥ పోయి వనదేవతుల మదితను పూ జ జేయుచు ఆటలాడుచు రేయు ధోరనదలంచుబోలెటి రేని నొక్కని

జూచినాదట॥అం॥ అదియు మొదలిదివరకు యెంతని ఆదరించిన పలు
కకను యీ సదయు మదిదలచుచును మాతో సరసమాడదు పలుకు
లాడదు॥అం॥ సారసాక్షిటులుండ మరిటుజూడ యిట్టి దటంచుబలికె
పారులే లిక మీరు దెల్పుడి వరుసతో వేడుదును మిమ్ముల॥అం॥ ర
క్షలును వీభూదులును మరి రయమునను గావించితికయీ పక్షివాహ
నుడైన తిరుపతి పంకజాక్షుడెగావవలెగా॥అం॥

వ॥ స్వామి యిది పలానిది అని చెప్పవారులేరు నాకు అంత
కుముందు తెలియదు మీరు నాపాలిదైవమై వచ్చినారు కాస్తజూచి
చెప్పండిస్వామి.

వ॥ చెయిజూచి యిట్లనియె.

నార-దర్వు-మద్య-ఆది.

మదనభూతముసోకెగా యీయింతికి ॥మ॥ మదనభూతముసోకి
మగువకు రేపగులొక్కటై।మదినితా దిగులొంది మరిమరి వగచుచుండే॥
మ॥ చిలుకల శారికముల చెలగి పాపురపుగుంపు లలుకతో జేర్చి కోవె
లలుగూయగ రాజ॥మ॥ తుమ్మెదల్ చుట్టుజేరి ఝుంమ్మని శ్రుతులు
బట్టి దిమ్ము దిమ్ముంచు బయలు దేరి వచ్చేటిరాజ॥మ॥ తిరుపతిహరికి సు
తుడై పరగజన్మించి హరిని గరితలకు పురుషులకు మరి సాంగత్య
మొనరించే॥మ॥

గీ॥ అమ్మ నీసుతకేమిభయంబులేదు। విరహజ్వరకాక సైచ కీ
విధముబూనియున్న।దిందుకు యోచనయున్న దిపుడు చెలగి। రుద్రాభి
షేకంబు చేయవమ్మా॥

వ॥ అమ్మా మన్మధునకున్ను యీరుద్రునకు వైరంబుగనుక
యీపని గావించిన నీసుతభీతిమాని లేచును శీఘ్రమ్మున గావింపుము
యిదే పోయివత్తునమ్మా ధరణి.

ద॥ వ॥ అలాగే పోయిరండి స్వామి.

వ॥ నారదుండు చనిన.

ధర-కందా-రేగుప్తి-ఆట.

చెలియా విను నారదు డిటు।లలియగ రుద్రాభిషేక మటుగా

వింపక శిలవృసగెగ్గానా। జని పూజం ద్రవ్యము లెల్ల దేవేజలరుహానేత్ర చింతలుమాని జనుమాయీధాత్రి। రాత్రి పొద్దాయనె రమణి వేగము యీ ధాత్రిలోచనకు నతివేగపూజింప జలరుహా॥

చె॥ వ॥ యేమి కావలెనమ్మా.

వ॥ పూవులు, గంధం, అక్షంతలు, సాంబ్రాణి, కర్పూరం, టెంకాయ, అరటిపండ్లు, వీభూతిపండ్లు, వక్కలు, ఆకులు, యివి మొదలయినవి తీసుకొని శీఘ్రంబున రావమ్మా అని చెలికత్తె నంపించె.

సంధి॥ యీప్రకారంబున రుద్రాభిషేకమునకు చెలులను పంపించిన తదనంతరంబున వకుళమాలికెస్వామిని వెతికేవిధం బెటులనెను.

వకుళ॥ వ॥ ఓరి వెంకట్రాయా ఓరి శ్రీనివాసా యెక్కడపోయెనమ్మా ఓరి నారాయణరారా తండ్రి రాత్రికూడా కొంచముగా భోంచేసితివే రారాతండ్రి.

వ॥ యెట్లబోయనమ్మా.

సం॥ యింట ముసుకువేసుకొనియున్న హరినిజూచి యిట్లనియె.

## 4-వ రాత్రికథ.

వకుళ-దర్బ-మంగళాది-తా-అలం.

బువ్వతిందువులేరా వెంకటరాయా బువ్వతిందువులేరా బువ్వతినర యెంతప్రొద్దాయనురా యీవనమున నిను వెదకితిగదరా॥బు॥ వంటాయరకడువనీగెను మరి యీవంటక మటుదిన వెంటనే లేరా ॥బు॥ సద్దిబువ్వ తినకను యెటుబోతివు పొద్దాయర నాముద్దులతనయా॥బు॥ బాజ్జవాడివిపంటను గదరా బజ్జవంటకం బిడిదెను లేరా ॥బు॥ ముసుకువేసి యీముసినవ్వేమిర ముసుకుదియ్యరా ముద్దులతనయా॥బు॥ యెంతబిలిచినను పంతమేల యిసుమంతయనక పాలంతబోతు లే ॥బు॥ తిరుపతిపురవరహరినై నాతో మరుగిడుటేలర మహానుభావా॥బు॥

గీ॥ అన్న నీనిదుర యేమందునన్న। యింతప్రొద్దు బాడచెనుగాన యీప్రొద్దుజూడ। రాత్రిజూడగ కొంచంబె యీపాత్రమునను। భోజనమ్ము జేసినావుగా భోగిశయనా॥

వ॥ అన్నా నాసామి నాబంగారు లేయిరా యేమి నిదుర
గా నాయన .

దరువు నీలాంబరి-ఆది.

అన్నా బువ్వతిందువుపేగలేరా నముగన్నాతండ్రి॥అ॥ అన్నాయ
న్నా యనుచును బిల్వగ యున్నవు నీమదినేమిసేతు నిక ॥అ॥ భోంచే
యర బహు పొందికతోడుత వేంచేయర శ్రీవేంకటరాయా ॥అ॥ పులు
సు కూరలును పొంకగు పచ్చిడి పులిహోర చక్కెర పొంగలి యు
న్నది॥అ॥ శబరిచే ఫలములు చెయ్యన గొనునతిక వశముజేసె నీకర
ములనుంచే॥అ॥ తల్లివద్ద వెన్నల్లాసముగను కొల్లగ గొనుగతి కుడు
మగ తిందువు॥అ॥ తక్కగ రుచిగల యుక్కెరయున్నది మెక్కక మరి
యేదిక్కన జను మికా॥అ॥ ధరతిరుపతిహరి కరుణచే ధర్మోధనము ను
సంగెద దయచేసియు లేవన్నా॥

గీ॥ తనయబువ్వారగింతువు తనవిదీర। లేచిరమ్మన్న యటు
మోము ద్రించుటేల కారణంబేమొ పలుకరా। కనల కిల్లు నిదురబోయె।
తన్నె దొంగనిదురకాని॥

దరువు-ఆది.

ఇంతమేలనయ్యా నాతో శ్రీనివాసా నిన్ను నేనెంతని వేడుదు
నయ్యా శ్రీనివాసా॥ తట్టితట్టిలేపినాను శ్రీనివాసా యిట్టి పట్టుపట్టుటేల
నయ్యా శ్రీనివాసా॥ వేడినీళ్లోయను లేరా శ్రీనివాసా॥ స్వామి నీవు వే
గమె జలకమాడర శ్రీనివాస॥ పూర్ణచంద్రునివంటి మోమటు॥శ్రీ॥స్వామి
మరి శ్రీచూర్ణము ధరియించవయ్యా శ్రీనివాస॥ మదికి యిష్టమౌన
టులు॥ శ్రీ॥ స్వామి కూరలదిగో వడ్డించినానయ్యా శ్రీనివాసా॥తిరుపతి
సామనలు మెచ్చ శ్రీనివాసా॥స్వామి మరి యీతీరునుండుటేలనయ్యా॥

గీ॥ తనయనేజేయు శిశ్రూషదప్పెనటర।భయముచేతను నీపై
ని భక్తియేమి। తప్పునె నీవు యేమేమి దలతువంచు।అనెడి శిశ్రూష
సల్పపాలాభోమునకేగ్రా॥

వ॥ నాయనా నేనేమైనా తప్పుచేసినా వుపచారములలో యే
మైనా తప్పినా మన్నించరా తండ్రి, యువిన్నిగాక.

సీ॥ వెంకటేశుడ నీవు వేటకై జనుదేరు టప్పు డాయడవిలో అతిశయముగా। మృగములచే భీతి తగిలి పలుకవేమేమొ। దానవుడె వడైన కానబడెను యెవ్వరిచే నింతయే బయం బొదవెను అప్ప నా శిశ్రూషదప్పెనేమొ। యావిధమాద్యంత మాదిగా దెలిపిన। చెలగి చికిచ్చలు జేతునన్న। కోరి యప్పనశ్రీల నెవ్వారినైనజూచి మోహించి యున్నను దాచవలదు నాలో దెలిపినవేగ నానాతిగూర్తు। వేడుకలు జూతునన్న శ్రీ వేంకటేశా॥

వ॥ అని వకుళ యిట్లనిన స్వామి దిగ్గున లేచి యిట్లనియె.

స్వా॥ గీ॥ యిప్పుడేను నీతో తప్పక జెప్పెద।జెప్పినపుడు నీవు జేయవన్న। యెటులనన్న తల్లి యిది జేయకున్ననే। బుప్పతినని పుత్రుప బోణి వినవే॥

వకుళ-స్వామి-సంవాద్మిదం-నీలాంబరి-ఆటం

వకు॥ అన్నా వినరా తనయావినరా అన్న వినర యీయడవిని కడిదియై నున్నగాని జేతునన్న నామాట వినవన్నా॥ అ॥

స్వా॥ అమ్మావినవే తల్లి వినవె అమ్మయ్యవినవెనిజమ్ముగ దెలిపెద కొమ్మయా నొకదానికోరి కామించితినమ్మా॥ త॥

వకు॥ యెవ్వారో యేపేరో యేరాజుకూతురో యావిధమెల్ల నాద్యంతముగను దెల్పవన్నా॥అ॥

స్వా॥ గగనభూపాలుని కన్నెయాదనయా మగసవపద్మావతిని మనమునకోరితి॥ నం॥

వకు॥ ధనధాన్యములుగల ధరణినాథుండు నిర్ధనులయిన వారికి వసగూడు టెటులరా॥ య॥

స్వా॥ తిరుపతిపురమేలు నరహరినైననే వరియించినానమ్మ వసుధీశుడొసగునా॥

స్వా॥ వ॥- యింతేతల్లి సమాచారము.

వ॥ గీ॥ యిల్లువిడచినివు యెపుడుబోతివిరన్న। పోయినట్టివాడు పొలతిగనియు। యెటులవచ్చినానెమొరుగంగజాలనే। నిన్నుపొగడతరమె వన్నతాంగ॥

క॥ అన్నా యెప్పుడు లేచితివన్నా యాపద్మముఖినియటుజూచితి వూరన్నా । యాశ్చర్యంబుగదన్నా నినుబొగడతరమె యాశేషునకున్॥

వ॥ యెప్పుడు లేచిపోతివిరా తండ్రి.

స్వామి॥ సీ॥ తల్లిరో వినుము నీతనివిడిరగవంటజేయుచుండగ తేజి చేరినేను। విపినభూములలోన వేటాడ కలభంబుగని దానివెంటనే జనగన దియు। నారాయణవనంబునను జేర్గానక నచ్చోట నొకవనమందుజూడ। నచటపద్మావతినయమున చెలులతో రాగనేజూచితినెరాజసమున। రాళ్లు రువ్వించెనాపయిని రయముమీర భీతిజెందియు యెటుజేరి నింత్రిపై నే। మోహమడపకయున్ననా మోహనాంగి నన్నుగూడక జేయవేనయము తోను॥

కాంబోది—ఆ.

యానాతినినను గూర్పుము మానకనీతోడయట్టి మర్మపువాక్యం బేనికదెల్పితి మరికడు। దానిని పరిణయము నొందెదాన మ్మతల్లి। దాచగనే లాదయను నాతల్లి। తల్లి వినవెమరియాతలిరాకుబోణిన యుల్లమలరగజేరి యుందునేనేలు దావమ్మతల్లి కొందునాతల్లి॥

వ॥ అని వకుళ యిట్లనియె.

వకుళ-ఆరభి-ఆటతాళం-ప్రలం.

యెటులానేనొనగూర్తురా వెంకటరాయ॥యె॥ యెటులనేనొనగూ ర్తు కుటిలకుంతలజేరి॥యె॥దొడ్డరాజుకూతురే యేవిధమునదోచకయిటుజే తురే సద్దజేసు రేమనమాసఖియనుఅడిగితే॥యె॥ ఆవన్నెలాచిన్నెలాకలి గినమనకంపునెయూయబలా యేవిధమొనగూడునావిధమెరుగనే ॥యె॥ నిధనపసులకును యాకోపులినిజముగచేసుకురునే వధలుచున్న యానసుధీ శుకూతురె ॥యె॥ కాసువీసము లేకసుదారిద్రమున వేసారియుడియేలను కానులవారికా కన్నెకబ్బుటయురుదె ॥యె॥ తిరుపతిహరియెరుగగాయా కన్నెను వరియింపనేమందును పరిపరివిధములపరికించదోచదె ॥యె॥

సీ॥ రాజ్యపాలనజేయు రాజసరాజతడు రాజ్యంబు లేనట్టిరాజు నీవు। ధనధాన్యములచేత దనరుచుందురువారు ధనహీనుడయుననిర్ధనుడ వీవు। పసుగజాస్వాదిగా పాలించుగలవారు పసుగజభటహీనపరుడవీవు చెలులను చెలికాండ్రు వెలిగుచుండెటివారు అసహాయుడా ఒంటిగా

మహీపు! యిన్ని వైభవముల నమరియున్నవారు వారిపట్టినినీకడుగ వారి లేమి! యూరుడుకోయనిమదినివిచారమొకటి ! వేగజనియంచె నేమందు వెంకటేశా॥

స్వా॥ గీ॥ అమ్మ నేనొకముచ్చటనతిశయముగ! జెప్పెదనువినుమా రాచచెలియ! తెరగు నాకుగాబుట్టియున్నది నాకెగాని ! యితరులను వ్వెల్లదిదివినుము యింపువదనా॥

వ॥ అమ్మా వక్కరహస్యంబు జెప్పెద నెవ్వరికిని దెలుపవలదు సావదానచిత్తురాలవై నాకర్ణింపవేజననీ.

వ॥ అమ్మా మున్ను వేదవతియను బ్రాహ్మణకన్యక నన్ను వరునిగా చేకొననిశ్చయించుకొని అఘోరమైనతపంబొనరింపుచుండగా.

గీ॥ పంక్తికంఠుడు వేగమాపడతిజూచి! మోహమునముచ్చటాడంగముదితయలగి! శ్రీనివాసునిచేతనుశిక్షగాగ! జేతుననరాముడై శిక్ష జేశితేను॥

కందార్థం॥ మునువేదవతికిబాసలు మునుకొని నేనిచ్చిరామమూర్తినైతా! గనిపరిణయింపుటనునే వినుకలియుగమునను నిన్ను వేడ్కనేలుదునే! యంచునుభాష వేడ్కజేసితి నే భాసురముగనుయాబాసలు తీర్పనాకాశరాజును యింటకన్నెగా గనుబుట్టెవేడ్క॥ తల్లి॥

స్వా॥ వ॥ ఆబ్రాహ్మణచిన్నదియగు వేదవతితపంబొనరింప రావణుండు మోహింప నతనినాచేజంపింతునని ప్రతిజ్ఞజేసి తాను అగ్నిలో ప్రవేశించిన నంతనేనురాముండై వనమున ప్రవేశించుకాలంబున సీతాహరణ సమయంబున వేదవతి సీతయైయున్న రావణుండు గొనిచనియె నంత నిజసీత అగ్నిహోత్రుచే పోషింపబడుచుండె యంతలో రావణ కుంభకర్ణాదులవధియించి లోకోపవాదంబుకొరకు మాయాసీతనగ్నిలో ప్రవేశించె నంతనిద్దరుశీతలు బయలుదేరిన నా తెరంగుమెరిగి యిదియేమి యను ఒకటి శీతగాయుండిన చేకొని మరి ఒకటి వేదవతిగా నెరిగి నది నన్ను పెండ్లాడుమనిన నిప్పుడేకపత్నివ్రతుండుగాన కలియుగంబున వెంకటాచలమ్ముపై యవతరింతునపుడు నిన్ను పరిణయంబు గావించెదనన్న రీతిని తాను ఆకాశనృపతియింటజన్మించి పద్మావతియను పేరువడసి

యున్న యక్కాంతామణి నాదేగాని నీకుజయంబుచేకూరు శీఘ్రంబున పెండ్లిపెత్తనంబుగావించి రావమ్మా తల్లి.

వకుళస్వామి-కాంబోది-ఆట.

యెటులనేబోదుర యేమిదెల్పుదురా శ్రీవేంకటేశా॥ స్వా॥ అమ్మా నీవటుబాగనరకి నినుబిల్తురే కన్నతల్లి॥ వ॥ కులముయేమన్న నే కోరియడుగుదురేమో వెంకటేశా॥ స్వా॥ శీతాంశుకులమని చెప్పగలేవటె కన్నతల్లి॥ వ॥ గోత్రమేమన్నను కోరితెలుపగలేనె వెంకటేశా॥ స్వా॥ కొమ్మరో వసిష్ట గోత్రమనుచుదెల్పు కన్నతల్లి॥ వ॥ తండ్రిమెవ్వరటన్న తనయుదెలుపగలేనె వెంకటేశా॥ స్వా॥ వసుదేవుడనుచునువాదితోదెలుపవే కన్నతల్లి॥ వ॥ తల్లిపేరడుగగ నెల్లదెలుపగలేనె వెంకటేశా॥ స్వా॥ దేవకియనుచు తెలియబల్కుము నన్నుకన్నతల్లి॥ వ॥ అన్నచెల్లెలనడుగనపుడేమిదెలుపుదు వెంకటేశా॥ స్వా॥ బలరాముడన్న సుభద్రచెల్లెలమ్మ కన్నతల్లి॥ వ॥ బంధువులెవరన్న బావమెరుగనయ్యా వెంకటేశా॥ స్వా॥ పంచపాండవులాప్తబంధువులనిదెల్పు కన్నతల్లి॥ వ॥ వర్ణమేమన్న నేవర్ణమెరుగనయ్యా వెంకటేశా॥ స్వా॥ నల్లవర్ణము పునర్వసుజననమెకన్నతల్లి॥ వ॥ యిన్నిదెల్పిన తుదకేమందురోనన్ను వేంకటేశా॥ స్వా॥ తిరుపతిహరికరుణవెరువకుపనియగునె కన్నతల్లి॥

స్వా॥ గీ॥ అమ్మ విను నీవు యీవెంకటాద్రిగడచి। కపిలమునిదర్శనంబునుగని యగస్త్యమునిని। శుకపురమాస్వర్ణముఖరి దర్శనంబు। గావించు నారాయణవనంబుచేరి॥

వ॥ అచ్చట తిరుగులాడుచున్నంత నిన్ను పిలుచుకొనిపోయి ఆకాశనగరుచేర్తురు ఆవలన నీకార్యంబెల్లచక్కపరచుకొని రావమ్మా తల్లి.

సంధి॥ వ॥ యీప్రకారంబున వకుళమాలిక నారాయణవనంబు చేరుచున్నసమయంబున స్వామియెరుకలవనితయై వచ్చేవిధం బెట్టులనెనం.

యెరుకలవేషం-తెర-ద్విపద-ఆరభి.

శ్రీరమ్యాపురా నెక్క - శ్రీరూపుదాల్చి-ధారుణిపై తనకుతరమైన యింతి-లేదులేదనిపొగడలేమియువేడ్క- మోదముతో బాలముద్దుగులుకుచును-పన్నీటజలకంబుబాగుగానాడి-చెన్నుమీరగనెక్క- చంగావి

లువ ధరియించిజరిబుటేదారిరవికెయును గురుతుచెంబులమీద కుచము రుగాదొడగి-శృంగారముగ-కురుల్ సొంపుగాదువ్వి-శృంగారకులుబొగడ బొట్టుధరించి - సొంపుగాతమజాతి - సొమ్ములన్నియును-పెంపొందగను చాలపెట్టియుమరియు-పరమేష్టినటుతనపట్టిగా జేసి-పరువడితనవామ భాగానగట్టి-నవరత్నఖచితమై- నాణ్యంబుమీర-భువినెన్నుకోదెలబుట్టి-తానెత్తిబెట్టియు-వీధుల బిరబిరతిరుగ-నట్టియరుకోయరుక-టంచునుబలుక కిలకిలనవ్వుచుకిసలయపాణి-వలపించిచూచేటి - వనితలకెల్ల - రెప్పార్పగనుతన్ను- నొప్పగాజూడ-గొప్పగానటు-తనకోర్కెలీడేర- తిరుపతిపురధామధీరుడైనట్టి-వరవేంకటేశుండువనితయై-వెడలె.

తెరవెడలు-దరువు-జులవత్రిపుట-ఆరభి.

వచ్చెనెరుకలవనితవేగమె హెచ్చుసొగసటుమీరగా ముచ్చటలుకడుహెచ్చరింపుచు మచ్చకంటులుబొగడగా వచ్చెనెరుకతహా॥కరమునను బంగారుబెత్తము శిరమునను నెకగద్దెబుట్టియు పరువడినిపళబాలు నొక్కని యురమునందునవడిగదనరగ ॥వ॥ వీనులనుమరివెండికమ్మలు వేట్కతోడుతమెరయగా జాణుడై యాపంచబాణుని సానదీర్చినబాణమోయన ॥వ॥ యిమ్ముగను వజ్రాలపేరులు రమ్యనునుయసియాడగా కొమ్మలటుతనుజూడబంగరు బొమ్మకై వడిదనరగా ॥వ॥ చెన్నుగనుపద్మావతిసతి చింతలెల్లలుదీర్పగా వెన్నుడా శేషాద్రిపురహరి వేట్కతో మదితగనుతానై వచ్చెనెరుకలవనిత॥

అటతాళం-నాదనామక్రియ.

మెరుకేమెరుకేలలనా యెల్లనునాకెరుకేభామా యరుకేనమ్మ యెరిగేనమ్మయెల్ల వారికోర్కెలెల్ల ॥యె॥ మనసులోనున్న మాటలెల్ల వనితరోనేవడిగదెల్పుదు ॥యె॥ గొడ్డురాండ్రాకొమ్మలకును బిడ్డలులేనిపీడాలెల్లా ॥యె॥ కొలలున్నానే కొలలుతీర్తు యిలువేల్పునినిలుపనేర్తు ॥యె॥ భామలాకుపచ్చబొత్తు ప్రేమమీరప్రియునిగూర్తు ॥యె॥ వద్దికై నావనితలాకు గద్దెజెప్పెసుద్దిజెప్పె ॥యె॥ మచ్చలున్నా సుళ్లుయున్నా హెచ్చుదాచక్రఫలములెల్లా ॥యె॥ పచ్చిబొట్టు బాలులాకు రక్షలునేరంజెల్లకడుదు ॥యె॥ మంత్రాయంత్రా తంత్రాములు మహినిజాలావిద్య

లెల్ల॥ మొ॥ ఘనముగా నన్నును దలచే ఘనులకు చిక్కుదుదక్కుదు॥ మొ॥ తిరుపతిశ్రీహరి నిదలచి గరితలున్నయా తెరగు దెల్పుదును॥

హాస్యగానిది॥ క॥ సుందరినీ వెవతివె నీచందంబును గాంచమది కిసంతసమాయెక। యెందరు సవతులు సుతులానందముతో దెలుపవమ్మ అంబుజనేత్రి॥

మొ॥ క॥ మెరుకలవారమటంచును మెరుగవటె సుందరదనయెల్లరకును। నేనెరుగుదు నన్నెవ్వరు ధరనెరుగరుయని మనమునందు నెరుగుము చెలియా॥

హా॥ గీ॥ అతివనిన్నెవ్వరెరుగరటంచు చాల। పలుకుచున్నావదే మిటిపద్మగంధి। చోద్యమాయెను నీమాటసుదతిదాని। వివరమరయుగ దెలుపవె వినెద చెలియా॥

మొ॥ గీ॥ కుమతులకును చాలగురునిందుతులకును। కూహకుల కుమాతృద్రోహులకును। కనులబడనుగాని కాంతరో నేనొక్క। కారణ కారణమున నీకు కానబడితి॥

హా॥ వ॥ అక్కారణంబు మెరుంగ దెల్పవే శింగి.

మొ॥ సీ॥ భువిలోన అజ్ఞాన పురుషులు మెండైరి గురువులందరు అడవితరువులైరి। మూఢులందరు జేరి రూఢికెక్కిరి మహాభక్తులందరు మతిభ్రష్టులైరి। దొంగవేషములెల్ల బొంగిదాల్పగనైరి మనసునిల్పని మంత్రమహితులైరి। తన్నుతా తెలియక తర్కించగానైరి ఆత్మవేత్తలమనుచు సనుటకైరి। గానననుమాత్రమైనను గానివారి కండ్లకగుపడక తిరుగుచు ఘనతమీర। నీదుమనమునకే చాలమోదమొంది కనులకగుపడినాని ఓకాంతవినవె॥

హా॥ క॥ వనజాక్షిరో నీవలుకులు విన వేడుకలయ్యెనాదు వీనులకర ము। మనమునసంతసమొందితి వనితా నీపేరుయేమొ వచియింపగదే॥

మొ॥ గీ॥ పేరులెల్ల దెలుప పెక్కులుగలవమ్మ। యిన్నియనుచు దెలుపనెవరితరము। నళిననేత్రిసహస్రనామంబులున్నవి। అన్ని నేనే నమ్మ సన్నుతాంగి॥

వ॥ యింకా జెప్పెదను వినవే భాగ్యశాలి.

సీ॥ యెరుకయుగలచోట యుద్భవిల్లుటచేత యెరుకలకన్నిగా నెంతునమ్మ। యేపాపములకును యేప్రొద్దుజనకను తాపత్రయంబులుతగు లనీక। రూపినింగాకరురూపినింగాకను వ్యాపారచింత యేవేళలేక తన్ను బాధలకును నేతల్లడబొందక యున్నదానను నేను సన్నుతాంగి। దిక్కుదిక్కులనెల్ల నేతిరిగితిరిగి। నిజముగామృగ నీదిక్కునిలచి నేను నాపయిన యాశగలిగిన నరులకెల్ల।చిక్కనునుగాని పరులకుచిక్కనమ్మ॥

హా॥ క॥ భవములుబొందకమరియును యవివేకపుత్రోవజనక యమ్మా। యాతరిప్రవిమలపదముల జేరుక శివకరముగటుండు టెటుల చెప్పవెకెంగి॥

యె॥ గీ॥ చెలియవినవమ్మ పెద్దలశేవజేసి మాయవాసులజేరుట మాని నేను।పరమగురుచరణములచాలభక్తితోను।దలచి యుగమంత శీఘ్రంబె దగలబెట్టి। ౫౦౦ కోట్లభూమండలమెల్ల నేకచక్రంబుగానేలు చుందు నేభాగ్యశాలి॥

హా॥ వ॥ రావేయెరుకలశింగి యేయేదేశాలుచూచినావ్రాయే యేపట్నాలు జూచినావూ యేయేనదులలో స్నానముజేశినావు చెప్పక రావే చెలియా.

యె॥ వ॥ అభ్యాయవ్వ నీవు అడిగినటువంటివన్ని చక్కగా దెలి పెద సావధానచిత్తురాలవై ఆలకించవే భాగ్యశాలి.

సీ॥ సఖియమూలాధారచక్రదేశముగని యందుగణనాధునియ భినుతించి।మరియుస్వాధిష్టానమను చక్రదేశానగని బ్రహ్మదేవునివినుతి జేసి। మణిపూరకంబును మహాచక్రదేశానవాసుడౌ యాజగదీశుజూచి। శదసిహానాహత కమలదేశముజూచి శంభునికిని నేనుసరగ మ్రొక్కి।విను విశుద్ధపువాసుజీవునకు మ్రొక్కి సరవి ఆగ్నేయమునఁనాత్మకరయ మ్రొక్కి। గంగయమున సరస్వతులగనియు వేగ స్నానమటుజేశినాన ఓ చానవినవె॥

వ॥ అభ్వాయవ్వ నేచెప్పిన యీమహాస్థలంబుచూడ నెవ్వరికి న్ని శక్యముగాదె భాగ్యశాలి.

మొహు-దర్వ్-నాద-ఆది-త్రాగతి.

కమలాక్షి వినవమ్మ మావూరు నీతో ఘనముగ దెలిపెద మా వూరు విమలమై మేటిగ వెలసిన గోడలరమణియ్యమయినదే మావూరు బోటిరొ జగతిఘనకోటలలో మేటి కోటగ వెలుగుచేమావూరు ఘనముగ ఆరుపడికట్లచే వెలసియు వనరికనున్నదే మావూరు కోకిలవాణి మాకో టకుతొమ్మిది వాకిళ్లుగలదదే మావూరు ఆరుపడికట్లపై అగ్గరుకావలి అరుదుగనున్నదే మావూరు మూడువీధులుచాలముచ్చటగలుగుచు వేడు కతోనుండు మావూరు అండజముఖ బ్రంహ్మాండపురంబని దండిగ వెలు గుచె మావూరుఆరుమేడలపైన యరుదుగనుండు సహస్రారపురమమ్మ మావూరు సురయక్షగంధర్వ కిన్నెరాదులపైన జొరగతరముగాదెమా వూరు తిరుపతిపురనరహరివసింపుచుచాల స్థిరముగనున్నదే మావూరు॥

వ॥ అవ్వోయవ్వ యిట్టి బ్రహ్మాండపురంబుజొరగ నెవ్వరికిన్ని తరముగాదె భాగ్యశాలి.

క॥ భాసురముగనాపురమును వాసించెటి ఘనునసేకవత్సరము లుతా। వేసరియు క్తులుబన్నిన ఘూసింపడుగాని వాని గానకవగచుః॥

క॥ చిక్కడుచిక్కినదక్కడు చిక్కునుగురుపాద శేవజేశిన్నైనం। గ్రక్కునచిక్కక చిక్కును తక్కకనాథునునిరొంచతరమేలతాంగి॥

వ॥ అవ్వోయవ్వ యిట్టిఘనునిగాంచుటకు యొక్కయుపాయం బున్నదది యెట్లంటే.

గీ॥ వకటి రెండు మూడు నొనరంగనాల్గను। అయిదు ఆరు యేడు ననెడిదాని। దూరపరచుచాలసూరుడై వెలసిన। నతని కబ్బునేమొ నతడు చెలియా॥

వ॥ అట్లంటే తెలియదుకదే శింగి.

వ॥ చెప్పెను వినవమ్మా.

వ॥ అవ్వోయవ్వ అహంకారం ౧ సంకల్పం వికల్పం ౨ దారేషణ ధనేషన పుత్రేషన అనెడి యీషణత్రయములు ౩ అవస్తన టనలు ౪ పంచేంద్రియంబులు ౫ అరిషడ్వర్గములు ౬ వ్యసనము లనెడి ౭ న్ను వీట్లనుదూరపరచి.

శా॥ శ్రీగురుపాదపద్మములు చిత్తమునన్ దలపోసి విశ్వముక్
వేగమె కాల్చివేసి తెలివే పరమాత్మపదంబటంచు పైపై గురిమేరలేని సుఖమందున సమాధిని గోలలాడుయా యోగియె జీవముక్తుడు సుఖోన్నతు డాలనికబ్బునే చెలీ॥

న॥ అవ్వోయవ్వ యిట్టి మునిని గాంచుటకు ౭ గోడలు ౭ పడికట్లు ౯ వాకిళ్లుగల బ్రంహాండపురంబులోనికి జొరగా నచట కావలివారల నంగీకరించవలెనే యవ్వా.

హా॥ ఆసవిస్తారం యెరుగ చెప్పవే కెంగి.

యె॥ చెప్పతాను వినవెయవ్వ.

ఆధారచక్రం ౧ పడికట్టు.

గీ॥ సఖియ గణనాథు డదిదేవు చక్రమరయ। నాల్గుధళములు గల్గి బల్ నాణ్యముగను। అరయ ష శ స హ భీజములమరి పీతవర్ణమై। మిగుల నాధారమునగ నెగడె॥

వ॥ యిదియే భూమిముద్రా.

స్వాదిష్టానచక్రం ౨ పడికట్టు.

గీ॥ సఖియ స్వాదిష్టానచక్రంబు వినగదే ఆరుధళ।ములు మరి అం దులోన బ భ మ య ర ల యనెడు భవ్యబీజములమరి। శ్వేతవర్ణముగ ను ఖ్యాతినొందే యిదియే వుదకచక్రం పత్మిముద్ర। ఆదిదేవత బ్రంహ్మ దేవుడేయవ్వా॥

మణిపూరకం ౩ పడికట్టు.

గీ॥ వినుము మణిపూరకం బిదివింతగాను।రక్తవర్ణము దశదళా ల్ రమ్యముగను డ ఢ ణ త థ ద న ప ఫ ను అక్షరములు। నదియు డెబ్బది రెండువేల్ నాడులమరీ।యిదియే పత్మముద్ర రక్తవర్ణం ఆదిదేవత విష్ణుదేవుడెయవ్వ ॥

అనాహతచక్రం ౪ పడికట్టు.

గీ॥ సఖియనాహతమనెడి యాచక్రమరయ। క ఖ ఘ ఙాది అక్ష రాల్ గలిగి మిగుల ద్వాదశధళంబు లమరుచున్న హృదయాకమలమను నామమో వినుకంజనయనా యిదియే మానాహతం యిదియే హృదయాక

మలం।యిదియే లింగముద్ర రక్తవర్నం యిదియే వాయువచక్రం।అది దేవత శివుడెచెలి॥

విశుధ్ధచక్రం ౫ పడికట్టు.

గీ॥ పదహారుదళములు పదహారుభీజముల్।అ ఆ ఇ అం అః అది యువరకు। కలిగియుజ్యోతిగా వెలుగుచునుండును।సఖియవిశుధ్ధమనెడిచక్రమిదియు॥

వ॥ అది జీవుడు యిదియే ఆకాశకమలం గొంతుకాయవద్ద యుండునేచెలి.

ఆగ్నేయచక్రం ౬ పడికట్టు.

కం॥ కనులబూమలనడుమ కడురమ్యమై రెండు।ధళముల పద్మంబు దనరియుండు।హాం సం యనెడి భీజమమరుచు।బంగారివన్నె గలిగియుండు వనరుహాక్షి॥

వ॥ యిదియే ప్రకాశముద్ర యిదియే మానసచక్రం.

సహస్రారచక్రం ౭ పడికట్టు.

క॥నారీమణివినుము సహస్రారంబున చక్రమహిమ అతిరమ్యంబై చేరియువేయు రేకులమరి। నారయమస్తకమునందు నదియుండసఖి॥

వ॥ యిదియేమేరుశికరం యిదియే ఆకాశముద్ర అచట రీం అను బీజాక్షరంవున్నది యిందుకు ఆదిదేవత గురుడు అచ్చట మండలంబులు మూడు సూర్యమండలం చంద్రమండలం అగ్నిమండలం అను మండలం త్రయములుగలిగి అచ్చట నలుచదరమై నడుమ మూడుకోణములు గలిగి భూమిన్ని వుదకముకూడి ౪ దళముల పద్మముగావుండును అందు పైపంచాక్షరంబులు దం హ్రీం హైం హం సం యివి కలిగివున్నది యిదియే అగ్నిమండలం ౮ దళాలుగలిగి అరటిమొగ్గవలెనే వక పద్మంవున్నది ౮ దళములపైన య ర ల వ శ ష స హ అనెడి ౮ అక్షరములువున్నది యిది బంగారువర్నమై యుండునెయవ్వా దీనికి మధ్యమనోన్మని అనేకశక్తివాసము చేయుచున్నదే చెలియా రవిచంద్రాదిత్యుల।ప్రభావంబు గలిగి శిరస్సునడుమ అమృతకలశంవున్నది అది అగ్నిమండలంమీద సంకోద్దారకముగా ఆఅమృతం కురుస్తూయుండునుగదే పక్షి ఆఅమృతంబు గంగాయమున సరస్వతియనుపేరు ప్రశిద్ధినొందిన

యీడ పింగళ సుషుప్న యనెడి నదులయందు ప్రవహించుచున్నది యవ్వా యీయాఱుచక్రంబులమీద కుండలి యనుసర్పంబుయున్నది దానిని నేర్పుచేత మేల్కొలిపిన సహస్రారమందున్న ఓంకారములో ఆపజ్యోతి అదియే పరబ్రంహ్మాంబు అదియే విరాట్పురుష వాసస్థానంబు అదియే మావాసస్థానంబు యీమర్మంబులు పరమగురువుల చేత ప్రసాదితంబై వీట్లను సాదించిరేని అరిచేతి అద్దమువలె కనుబడు నేలతాంగి.

పా॥ క॥ అచ్చట మరి యేపురుషుం। డచ్చుగవసియించి యుండు నాతెరగెల్లం। ముచ్చటగావినదోచెను। హెచ్చుగవశియింపవమ్మ యెరుకలశింగి॥

యె॥ వ॥ యిట్టి పురంబేలేటటువంటి మహానుబావుడు అకార వుకార మకారంబులజేరి ఓంకారస్వరూపంబై సృష్టిలయాది కర్మంబులకుకర్తయై సకలోల్లాసంబున మోక్షలక్ష్మిసహితంబుగా పరమగురుడువాసంబై దేవాదిదేవతులకైనకనుబడకసూక్ష్మంబై జ్యోతిరూపంబై విలశిల్లుచున్నాడేయవ్వా యిట్టిమహాపురుషుని గాంచుట కెవ్వరికిన్నితరముగాదే భాగ్యశాలి.

త్రిపుట-ఆది-జులవ-34-దెబ్బం

మానినీమణివినవే ధరణిశూనబాణునిచేత జిక్కియు వాని గెలువనుదారిగానక మాయలోనా చిక్కినిమిషముసౌఖ్యమునకై సొక్కిసోలుటయేలనే నిక్కముగ యీదొంగకుక్కను నెగడగట్టి ఆత్మవెత్తలమనుచుదాత్రిని అనగవచ్చునుగాని నిర్మల ఆత్మకనుగొని మనసునిల్పుట కష్టమమ్మా తలలుబోడిగజేశి మరియే తలపులేదనవచ్చునే తలపుబోడిగచేయ నెవ్వరితరముగాదె యరుకగలిగియుహెచ్చరికచే మరుగుమరుగున తిరుగులాడుచు నిరతమును యందుననుజోరకను నెగడవలెనే తిరుపతీశుని శరణుజొచ్చియు నిరతమును యానీరజాక్షుని గురుకటాక్షపురీతి మదిలో స్మరణజేశి॥

వ॥ అట్టి వారికి గురుడు చిక్కునేయవ్వా.

పా॥ గీ॥ మగువరొవినుముయా మహామహుని। దర్శనంబుగా

వించుటకును మూలంబదేది। తెలియజెప్పినవిందునే తేటపడగ। మర్మమి డకను దెలుపుమా మగువనాతో॥

మొ॥ వ॥ చెప్తాను వినవమ్మా.

క॥ గురుచరణ శేవజేశియు। స్థిరమతితోనుండి యితర। చింతలు మదినిక పకువడికోరక సకలము। నురచినగాన్పించునమ్మ మర్మరుపింటే॥

వ॥ అక్కా యిట్టి ప్రశస్యంబు లనేకంబుగలవు మాంబురకసికి తానంతబువ్వబెట్టించవేతల్లి.

వా॥ క॥ మీదైవంబేదైవము। నాదేవ్రుని తెలియబలుకు తేటగ నివుమక సోదశిగెద నటుమీదట। వాదిశకసు దెలుపవమ్మ వనరుహనేత్రీ॥

మొ॥ సీ॥ కలికిరో వినవె నాయిలువేల్పుదైవంబు పార్వతినాథుడే పణతివినవే। ఇతనిదైవమ్మె నలరుచున్నేను మాకును మేమెదైవమో కుంద రదన। నాదేవునుని చాలనయముసధ్యానించి। వూరూరువెలశిన యువిద లకును। యెరుకజెప్పుచునుందుమయింతిరో యీపురశృంగార మిట్టుజూచి పొంగుచున్న। నంతలో నన్ను అడిగినవింతప్రశ్నలకును। నిచ్చోట నిలచితి నంబుజాక్షి యెరుకనడిగెడుయవ్వనగరితలకును। యెరుకచెప్పుచుచూపు మా యింతులెవరో॥

చెలి॥ వ॥ అమ్మా మనపద్మావతికి యెట్లవున్నదో యెరుకలసాని వకటివచ్చియున్నది పిలుచుకొనివస్తానటమ్మా.

ధర॥ వ॥ పిలుచుకొని రావమ్మా.

చె॥ వ॥ అమ్మయ్య యెరుకలశింగి నిన్ను దొరసానికమ్మన్నది గాన రావమ్మా.

మొ॥ వ॥ ఆలాగె వస్తానమ్మా.

ధర॥ వ॥ అమ్మా నాచెయిచూచి నామనస్సులోవున్న తలంపు జెప్పినట్లయితే నీకు బహుమతి యిస్తానమ్మా శింగి.

మొ॥ వ॥ అవ్వోయవ్వ కురుకుగాగూర్చేవే వక్కమనస్సుతో నుండవే గద్దెబెట్టికి ముమ్మారుమొక్కవే అక్కా.

ధ్యానం॥ లంకాపురశాంకరి వందారుగిరిజాదేవి కాశివిశాలాక్షీ మధురమీనాక్షీ వుజ్జనీమహాంకాళి మూలస్థానాంబ అహోబిల నారసింహా తిరుపతివెంకటేశా మీరుసాయమైరాండి యీబాల

కోరినకోరికలు సపలముగాపలికెచరేస్వామి శరణుశరణు మీపాదాల కుశరణు.

### గద్య జెప్పడం.

వ॥ అవ్వోయవ్వ వక్కతలంపుతలచినావే వక్కకోరికకోరినావే వక్కముచ్చటకడుగుతావుసుండి అతలంపుయేమైనాసెయని దిగులు పడినావే యెర్రిబుర్రి సపలం అవుతాది లేవేఅక్కా ఆతలంపు సురులకో దానవులకో పచ్చికో వృక్షానికో నిఅడగవేయవ్వా అదిసురులుగాదు దానవులుగాదు పచ్చిగాదు వృక్షముగాదె నీయమ్మకూతురా వక్కపాణి వక్కజీవినికోరి అడిగినావురాకొడకా ఆజీవి నాకేమికావలెనని యడగవెయవ్వ యిట్లావారికంటె తెలియందంటెయవ్వా అన్నంటె వీపుజూపె తోడబుట్టతమ్ముడంటె బుజంబుచూపె బంధువుడంటె పార్శ్వంబుచూపె పగవాడంటె నొసలుజూపె బిడ్డంటె కడుపుచూపే అదిగో ఆబిడ్డ కడుగుతావెయవ్వా.

దర॥ వ॥ అవునమ్మా అవును.

యె॥ వ॥ అవ్వోయవ్వ నీకూతురుతగినవేళకు వనమునకుబోయి అచ్చటొక బొల్లిపిట్టనెక్కి నల్లనయ్యనుజూచి మోహించి అతనిపై రాళ్లుబువ్వేదోషంబు యిట్లాబాదిస్తున్న రేపగలు ఆదైతమీద కాంక్షచేత మదనబాణ పీడితురాలై అన్నము నీళ్లు అంటక విరహవేదనచే గుంపుతున్నదేయవ్వా.

ఎరి॥ వ॥ యిందు కెట్లనమ్మా.

యె॥ వ॥ అవ్వోయవ్వ యీబాలికామణిని ఆనల్లనయ్యకిచ్చి శీఘ్రంబున వివాహంబు గావించెదమని ముడుపుగట్టితే తక్షణం నీకూతురులేచి బువ్వత్తిని సంతోషముగా వుండునే అక్కా.

దర॥ వ॥ ఆనల్లనయ్య యెక్కడవుండేది తెలియనుగదే శింగి.

వ॥ అవ్వోయవ్వ యీ వూరికి వాయువ్యభాగాన ౨౪ ఆమడ దూరాన యేడుకొండల నడుమ జే అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడై ఆశ్రితజనరక్షామునియై శ్రీ శేషాచలనివాసియై నీముద్దుకూతురిని వివాహంబు చేయదలంచి వొకపేరంట్రాల నంపును ఆమెనచ్చి పెండ్లి ప్రయత్నంబు మాట్లాడి స్థిరముజేసుకొనిపోతున్నది యిదియో వచ్చెనే

ళాయను నామాట తర్కటగాను ఋక్కటకాను తిబ్బరకాదు తాటో టుకాను టక్కకాను టమారంకాదు యిదే వచ్చేవేళాయను మాబుర కనికి అంతగెంజి పొయ్యవే నేను పోయివచ్చెదనే అక్కా.

సంధి॥ అని యెరుకలసాని జనియె.

ధ॥ స్వామి యేడుకొండల వెంకటేశా యీబాలామణి లేచి భోజనము జేసి మాతో నవ్వుచుండిన నీకు యీస్త్రీని యిచ్చి వివాహా ము చేస్తాము స్వామి.

వ॥ అని ముడుపు గట్టిరి.

సంధి॥ యీప్రకారంబున వకుళమాలిక కపిలమునీశ్వరుని ద ర్శించి వచ్చుచున్న సమయంబున చెలికత్తెలుతో వకుళమాలిక యిట్లనియె.

గీ॥ సుందరాంగిరో నీమోముకందియున్న। చందమెరుగంగబ లుకుమా చాలవినగ। మదినిపూరకెవిస్మయమొందుటేల। వుస్సురంచు ను నిట్టూర్పువచ్చుటేలా॥

చెలి॥ గీ॥ పణతివినుధరణి నాదునిపట్టియైన। పద్మజాకనాథు వ నమునపద్మ నేతుర్మి। గనియువానిని వరియించిఘనునిపైని। మోహాము న గుంపుచున్నదా మోహనాంగి॥

వ॥ యెంతబిలచినా పలుకకయున్నదిగావున రుద్రాభిషేకమున కు పూజాద్రవ్యము తేనుపోతున్నాను మీరు యెవరు మీపేరేమి మీ వూరేది చెప్పవమ్మా అనిన.

వకు॥ సీ॥ అఖిలాండకోటి బ్రంహ్మాండనాయకుడను శేషాద్రి వాసుండు శ్రీనివాసు। డంపగా పెండ్లిపెత్తనముచేయగ నిటకువచ్చిలి నాపేరు వకుళమాలయంను రెప్పుడును మీసుందరాంగిని వెంకటేశుని కొసగుడియింపుమీరా। యిచ్చిన యిద్దరు ముచ్చటాడుచు భక్తవరులను బ్రోచుక- వసుదయంను। నుంనురటుగాన యిపుడు మీరొప్పి పెండ్లి జేసినను లోకపాలకు శ్రీనివాసు। మమ్ము మిమ్ముల నేలుచు నెమ్మతి గను। యేలువాడమ్మయంచబల్ మేలుకాడే॥

చె॥ వ॥ అయితే మాధరణిదేవివద్దకొచ్చి మాట్లాడవమ్మా.

వ॥ ధరణిదేవితో చెలికత్తె.

## దరువు-యేకతాళం.

నీ భాగ్యమె భాగ్యము తల్లి ॥నీ॥ నీభాగ్యమింక నేనేమి నివర్ణింతు యేభామలకు యీ వైభోగమబ్బునే॥నీ॥ అఖిలాండకోటి బ్రంహ్మాండనాయకుడే నీ అల్లుడై నీసుతను పెండ్లాడగవచ్చెనని॥నీ॥ మానినిమెరుకలసాని జెప్పినరీతి మానిని వచ్చెదని మమతతో చూడవమ్మ ॥నీ॥ అక్కా మన మన్నరీతి నిక్కమైదోచ నిది చక్కపడుట మన కొక్కటె చాలుగాని॥నీ॥ తిరుపతిరాముల కరుణచే పద్మావతి పరిణయమౌను యేభయము నొందగనేల ॥నీ॥

గీ॥ వెంకటేశుడు నిటుబంప వేడ్కనీవె। పెండ్లి పెత్తనమును జేయ పెంపుగాను। వచ్చుచున్నంతనే గనివడిగ నిటకు।తోడి తెచ్చితి నిటకును తోయజాక్షి।

## ధరణి వకుళ-సంవాదం-ఆరభి-ఆది.

ద॥ యేవూరు గేదేశ మిందువదన నీదియిం ॥వ॥ వెంకటాచలమున నెపుడు యుందురో తల్లి॥ద॥ నీపేరు దెలుపవమ్మ నీరజనేత్రి నాతె॥వ॥వకుళమాలికయని వసుధయందురె తల్లి॥ద॥యేకార్యమున కిటు యరుదెంచినావె తల్లి॥వ॥ పెండ్లిపెత్తనముసేయ పేరంట్రమొచ్చినానె॥ ద॥యేబాలబాలుడో యెరుగింపవమ్మ తల్లి॥వ॥ నీపుత్రిరత్నమును నా పుత్రునికోసగవమ్మ॥ద॥ నీపుత్రుడెట్టివాడో నిజముగ దెలుపవమ్మ ॥వ॥ అఖిలాండకోటి బ్రంహ్మాండనాయకుడె తల్లి॥ద॥ పేరేమి దెలుపవమ్మ ప్రియమునసంతసమ్మ॥వ॥ వెంకటరాయుడమ్మ వెలదిలలామవినవే ॥ద॥ తల్లితండ్రులపేరు తగును దెలుపావె కొమ్మ॥వ॥ దేవకితల్లి వసుదేవుడె తండ్రి చెలియా॥ద॥ అన్నదమ్ములు చెల్లెలరయయున్నారె తల్లి॥వ॥అన్న బలరాముడు చెల్లెలు సుభద్రదేవి ॥ద॥ బంధువులున్నరేమే బంబరసమవేణి వ॥ పంచపాండవులేయాప్త బంధువులై యున్నారమ్మ॥ద॥ యేవంశగలవారో యెరుగజెప్పవే తల్లి॥వ॥ చంద్రవంశమటంచు సఖియవినవేనీవు॥ద॥ యేగోత్రమొప్పువాడో యలమిదెల్పావె తల్లి॥వ॥ వశిష్టగోత్రమమ్మ వనజదళాక్షివినవే॥ద॥ నామనక్షత్రమేమొ నయమున దెలుపవమ్మ॥వ॥సఖియా పునర్వసుజనన మొందినవాడె॥ద॥ నల్లాని మేను యెరుపా నయమున దెలుపవమ్మ॥వ॥ నీలమేఘపుచాయ నొనరినమేనివాడే ॥ద॥ నలినాక్షి

అంతటి నలుపేమెముద్దుబాలా॥వ॥ వినుకృష్ణపక్షమున జననమొందినవా డే॥వ॥ మేపాటిభాగ్యమమ్మ వెలదిలోదెలుపవమ్మ॥వ॥ లక్ష్మికరుణగ ల్గు పక్షివాహనుడెతల్లి॥వ॥ నేగోరుచందమున నినుగనెడిభాగ్యమాయె వ॥ తిరుపతిహరి మున్న మరిభయమే మెతల్లి॥

వ॥ గీ॥ పాల్పద్దుబున్నపేల పాలతియూవార్తసిబర్తకాఁడుగాదెరి ప త్రికయును। వారిచ్చియంప నేను వడిమీరాజనియిది। వెంకటేశుడును వి న్నవింతూ॥

వ॥ అనిన వకుళధరణీదేవితో చెప్పుసమయంబున ఆకాశరాజు సభాస్థళంబునకు వచ్చేవిధం బెటులనిన.

# 5-వ రాత్రికథ.

ఆకాశరాజువేషం-తెరలో-నాటం.

గీ॥ అంతనాకాశనృపతియు నతిశయముగ। సభకుజేరగదలచి తాసఖులతోను। వడలివచ్చెను భటులంతవేలకొలది। గొలుచుచుండగ తనసభాకూటమునకూ॥

తెర వెడలుదరువు-మునితాళం-మద్యమావతి-ఆది.

ధరణిపతియువచ్చెకడువడి ద ధరణిపతియు ధండారనమున మరి దరదిశలదరగ బిరబిరసభకును॥ధ॥ పరసుపిండివాలరకిబట్టులు ముద్గరములు బిరబిరగిరగిరద్రిప్పగ॥ధ॥కనకకుండలంకారరత్నకంకణము మకు టమణి ఖచితయుచితముగ॥ధ॥ ధరతిరుపతినరహరి నటుదలచుచు మురి పెముననను తనముద్దుకూతుగన ॥ధ॥

వ॥ విచారణ చేయవలసినది.

సంధి॥ వ॥ యీప్రకారంబున రాజు కచ్చేరిచేయుసమయంబున ధరణీదేవి రాజుతోయిట్లనియె.

ద॥ వ॥ పదివేలువందనంబులుస్వామి.

ఆ॥ వ॥ సుఖీభవ సుఖీభవ హేసఖీ.

ధ॥ వ॥ స్వామి.

రా॥ గీ॥ బ్రహ్మక్షత్రియ వైశ్యసభాంతరమున। యిటులరాగ నునీమనసెటులగలిగె । యింతభీతియుమానిభులేలరాగ । వచ్చుపనినేము దెలుపవే వనజగంధీ॥

ధరణి-ద్విపద-కాంభోది.

ప్రాణనాయక-ఓభక్తపాల-నీపాదపుష్కరాగ నిదివేళగాదు-వచ్చిన సెగ్గుంచవలదిక వినుము-ముచ్చటగాను-నీముద్దుకొమారి-తొల్కనాడు-తనచెలులతో చేరివనము-నకలంకతిరిగిపూజలుసల్పువేళ- నొకమహాపురుషుని నెయ్యనజూచి-తకతకలాడు- నీతనయునుగంటె-నాపురుషపై బ్రాంతినంటితా-బువ్వనేపూటనంటకనేపుచున్న-రక్షలుకట్టిరుద్రాభిషేకంబు-యీక్షణంబునజేయనొప్పినయంత-యెరుకతనేతెంచి-యీజాడ నెరుకపరచియు- శేషాద్రిపై నశియించు-పురుషునిగనియు-నీపుత్రిమోహించె-నరుడుగా-నతనికి-నాతినియొసగుడని-చనెనంతలో-వనితకువిరహముసతగ్గె-నొకయిందుముఖియు- శేషాద్రిగడచియు-నాదుదగ్గరజేరినీదు-పడతిని-నాముద్దుపట్టికొసంగు-మనుచువేడుచునున్న- మదవతి-యిదిగో యించుకైనను-తడవెంచకమదిని-యీమహానీయున- కాజగద్రక్షు-కీముద్దుకూతురినిచ్చి- పెండ్లియును చేయుముచేయుము-చేయకయున్న-నీమెడనీపుత్రినె-మేమియగును-తిరుపతిపురహరి-కరుణచే-దీనినెరిగింపవచ్చితినింతియెనాదా.

వ॥ ప్రాణేశా నీముద్దుకూతురు యగుపద్మావతిని శేషాచలవాసుండైన శ్రీవేంకటేశ్వరులకిచ్చి వివాహంబుచేయుము నాతనికిచ్చునటుల మొక్కుకొని ముడుపుకట్టినది మొదలు పద్మావతిసంతోషముగానున్న యదియునుంగాక యీపద్మావతి యీమహానుభావునకై మనయింట జన్మించె నీవృత్తాంతంబు నేనెరుగుదు యీమర్మంబు నావల విన్నవించెద శీఘ్రంబున శుభరేఖవ్రాశి పంపుమా ప్రాణేశా.

సంది॥ యీప్రకారంబున ధరణీదేవిచెప్పిన తదనంతరంబున ఆకాశరాజు మంచిది అని దేవగురుని ధ్యానించగా వచ్చేవిధం బెటువలెను.

బృహస్పతులు-దరువు-ఆట.

దేవగురుడువెడలివచ్చెను యీరాజసభకు ॥ దేవ ॥ దేవగురుడు వెడలివచ్చె దైవబృందముల్లెల్లగొలువగ కావవేశ్రీహరివ రియన కడు

ముదమున దలచుకొనుచు ॥దేవ॥ వెంటను తనశిష్యులెల్ల వేదములు జదువుచుండ జంటగప్రియశిష్యులెల్ల చయ్యనతనకెదురునిల్వ ॥ దేవ ॥ తిరుపతీపురహరినిమదిని స్మరణజేసి ముదమునను యాహరి కరుణచే మరియు నారాయణుని సేవింపంగదలచి ॥ దేవగురుడు ॥

రాజు॥ వ॥ పదివేలువందనంబులుస్వామీ.

బృ॥ సుఖీభవ సుఖీభవ సుఖంబుననుండుము రాజోత్తమా

రాజు వ॥ హేదేవాగురువరేణ్యా వకసంగతి యేమనగా వ్రుకనాడు నాముద్దుకొమార్తెయగు పద్మావతివనమునకుపోయి అచ్చట ఒక పురుషునిజూచి అతనిపై రాళ్లురువ్వించినందున అదిమొదలు విరహావేదనజెందుచున్నసమయంబున వకయెరుకత యేతెంచి నీకుమారితెను శేషాద్రివాసుండైన శ్రీనివాసమూర్తిజూచి మోహించినాడుగాన యీ స్త్రీని అతనికి యిచ్చివివాహముచేస్తామని ముడుపుగట్టితే నీకొమారతె లేచి సుఖంబుగానుండును అని చెప్పిపోయినది మేము అదేప్రకారం గావించినది మొదలు సుఖముగావున్నదిగాన యిప్పుడు శ్రీనివాసమూర్తి యిప్పుడు వ్రుకపేరంట్రాలనంపి పెండ్లిపెత్తనంబు మాట్లాడిరమ్మని పంపించినాడుగాన యిందుకు యేమియోచన చెప్పుముస్వామీ.

బృ॥ వ॥ హేరాజోత్తమా నీభాగ్యమేభాగ్యము నేను యెంతనికొనియాడుదు శ్రీనివాసమూర్తికి నీముద్దుకొమారితెను యిచ్చి వివాహంగావించెదనని వ్రుకశుభరేఖవ్రాసిపంపవయ్యా రాజోత్తమా.

రాజు॥ వ॥ ఆహావ్రోరి చారులారా శీఘ్రంబున వ్రుకబంగారురేకు తయారుచేసుకొనిరారా.

భ॥ వ॥ అలాగే తెచ్చినాము స్వామీ.

రా॥ వ॥ హేగురువరేణ్యా వ్రుకయానతియేమనగా యిప్పుడు ఆ శ్రీనివాసమూర్తి జగద్రక్షకుకర్తగాయున్నాడుగాన అతనికి మనము శుభరేఖవ్రాయడమ్ములో వందనమాలేక ఆశీర్వచనమా దెల్పుముస్వామీ.

బృ॥ వ॥ హేరాజా అతనుశ్రీనివాసమూర్తి అయినప్పటికిన్ని నీ యింటికి అల్లుడై వచ్చెనుగాన నీవు వందనము అని వ్రాయకూడదుగాన ఆశీర్వదించినాము అని వ్రాయుము.

జాబువ్రాయడం॥ - రాజు - సీస.

శ్రీమదఖండలక్ష్మీప్రసన్నులను యాశేషాద్రి నెప్పుడు వాసియ గుచు। వెలయుచునున్న యావెంకటాచలునకు శిరులొప్పగాను యాశీర్వదించి।ఆకాశరాజుతావ్రాయుటేమన్న మేమిచ్చటకుశలంబుమీరుదుక్షేమమపుడపుడంపింపనగు మీరుపంపిన అమ్మపలుకులకును సమ్మతించి। నాదు ముద్దుకొమారితె నాదుపట్టియైనపద్మావతిని నీకొసంగువాడ।బంధుమిత్రజనావళుల్ బవ్యమునను। వేగవేంచేయవలయుశ్రీవెంకటేశా॥

సం॥ వ॥ యీప్రకారంబున శుభపత్రిక వ్రాయుచున్నసమయంబున శుకమహాముని వచ్చేవిదంబెట్లనిన.

శుకమహాముని - తెర.

క॥ వ్యాసునికొమరుడటంచును భాసులముగ ప్రబలువాడ పరువడియాశ్రీనివాసునిగురుడటుజేరగ।నాశతొ వెడలినశుకుండనంగనువినరా॥

దరువు - ఆట.

శుకుడానునేనెరా ఆవ్యాసునిసుతుడనునేనేరా॥ శుకుడానునేనేర సుందర శ్రీహరిని అకలంకమతిదలచునట్టివాడనునేనే ॥ శుకు ॥ సురగురుడటుబిల్వసుస్థిరమునలేచి పరువడివచ్చినబలుతపసినియైన॥శు॥తిరుపతిరాములధీశునిమదినిల్పి వరవేంకటగిరివాసుభజించేటి ॥శు॥

వ॥ హాస్యగాడితో ఆహావ్రారినాయనా నేనువచ్చినానని బృహస్పతులవారితొ చెప్పరావ్రెరి.

హా॥ వ॥ స్వామి బృహస్పతులవారు శుకమహాముని వచ్చియున్నారు.

బృ॥ వ॥ పిలుచుకొనిరారా వ్రొరినాయనా.

వ॥ వదివేలువందనంబులు స్వామి.

శు॥ వ॥ సుఖీభవ సుఖీభవ.

గీ॥ యేమికార్యంబునకును నన్నిటులబిల్వ। యెట్టికార్యంబు యేవింతయేనెనర్తు। నట్టిపనియేదొ దెలుపు డీ ఘట్టిగాను। తప్పకను జేతునీమాటతధ్యమరయా॥

వ॥ ఆకార్యంబేమొ తెలియజెప్పరయా శ్రీమ్పతి.

రా॥ వ॥ పదివేలుదండంబులు స్వామి.

శు॥ వ॥ సుఖీభవా సుఖీభవా.

రా॥ వ॥ స్వామి యీరత్నపీఠమునందు కూర్చుండిస్వామి.

శు॥ వ॥ ఆలాగే కూర్చుంటానయ్యా రాజేంద్రా.

బృ॥ వ॥ హేమునీంద్రా శేషాద్రివాసుండగు శ్రీనివాసమూర్తి పద్మావతిని పెండ్లియాడదలచి వకుళమాలికెను నేడుపంపించినాడుగాన యిప్పుడు మేమందరముగూడి శుభముహూర్తము నిశ్చయించుకొని శుభపత్రికె వ్రాశియున్నాముగాన నీవుయిప్పుడుఆపత్రికగైకొని శ్రీనివాసమూర్తికియిచ్చి తిరుగుపత్రికగైకొనిరావయ్యా శుకమహామునీంద్రా.

శు॥ వ॥ ఆలాగేపోయివచ్చెదనయాగ్రీష్మతీ.

దరువు- ఆట.

శుకమహాముని వెడలివచ్చెను శ్రీహరికడకు ॥ శుక ॥ శుకమహాముని ముదమునను బలొ సొంపుగను పత్రికనుబూనుగ సకలభువనాధీశుడౌ శేషాద్రివరువరుచేరి బిరబిర ॥ శుక ॥ హరికిపరిణయ మనుచుతన మది మురిశిపడ శ్రీహరికినెప్పుడు పరిణయంబౌనే నటేజూడరయగను నెపుడబ్బునోయని ॥ శుక ॥ మాటిమాటికితిరుపతీపుర హాటకాంగుడగు వెలచిన తాటకీసంహారునకును దలచిదలచి మ్రొక్కులిడుచును ॥ శు ॥

సంది॥ యీప్రకారంబున శుకుడు పత్రికయెత్తుకొని శేషాద్రికి వచ్చుచున్నసమయంబున స్వామిలేచివచ్చి శుకులతో యిట్లనియె.

దరువు-సావేరి-ఆట-ఆనందరసం.

కాయోపండో హేమునినాథ ॥ కా ॥ కాయోపండోయాక్రమము దెల్పినగాని యీయెడమనసుకేమేమొ దోచెదింక ॥ కా ॥ యిప్పుడేనంపిన యిందువదనతోడ తప్పకతమపుత్రి యిప్పింతునన్నారొ ॥కా॥ ధనధాన్యములచేత ధనరెడునారుణ మనమునవెంచక మరికాదటన్నారొ॥ కా ॥ పంపినకార్యము పండౌనటంచునే తెంపునవెరిగితి తిరుపతిహరిదయచే ॥ కాయోపండో ॥

వ॥ హేమునినాథా కాయాపండా దెలుపుముస్వామీ.

శు॥ హేశ్రీనివాసమూర్తి పండేనయ్యాస్వామీ.

శు॥ యీపత్రికజూచి వేరేపత్రిక వ్రాసియివ్వండిస్వామీ.

సంది॥ అనిన పత్రికజూచి స్వామి మొగలిరేకుమీద పత్రికవ్రా యడ మెట్లనిన.

స్వా॥ సీ॥ బాదరాయణసుతం బట్లుగావినుమని సరసీరుహాక్షుండు జదివె నిట్లు। శ్రీపూర్ణ రాజపూజితులైన ధర్మతత్పరసుధర్మ సుధర్మవర సుతులగు।సాంమ్రాజ్యకలిత రాజశ్రీగగనరాజుగారికి శేషాద్రివల్లభుండు। వందనంబులు నేటివరకు మాకు శుభంబు వకుళమీకుశలంబువ్రాశి పం పతగును వైశాఖమునశుక్లదశమినాటి శుక్రవారంబురాత్రి శుభము హూర్తమునకు। మాబంధుమిత్రులు మొనసిగూడి వత్తుమచ్చటికి పదివే లు వందనములు॥

సంది॥ యీప్రకారంబున శుకులవారివద్ద శుభపత్రిక వ్రాసియి చ్చి పంపించిన తదనంతరంబున వకుళమాలికకు ధరణిదేవి సకలభూష ణంబులు బహుమానంబు యిచ్చిన శేషాద్రికిచని హరితో యిట్లనియె.

కందార్థం- ఆట.

అన్నానీసందమునే తిన్నగవినుతింప।మంచిదేయనివారల్ నన్నా ధరించిపత్రిక చెన్నుగమరిబంపినారే శేషాద్రివాస। నీతెరగెరుగజేయ జెగధీశ అశుభరేక లికియించినచందాన ఆసుఖదినమున। నరుదేరవలెన య్యా శేషా నీతెరగెరుగజేయజగధీశా॥

స్వామిదర్వు - ఆనందభైరవి - చౌక - ఆది.

అమ్మానీతోపద్మావతి ముచ్చటలాడినదెల్ల దెలుపవే సమ్మతిగను సరసిజాక్షునకే కొమ్మనగుదునని కోరిబల్కెనటే ॥అ॥ ఆబాలాతల్లితం డ్రులేమైనాను అపహసించిరో దెలుపవే శబాసురేశేషాద్రీశుడె మరి నా పాలికి అల్లుడని సంతసించిరో ॥అ॥ కన్నెనుజూడనాకై నచిన్నారిగ యు న్న దేమమ్మ దెలుపవే పన్నుగనీతో యాభామినిసుందర మిన్నవించినదె ల్ల నిజముగాదటవమ్మా ॥అ॥ మేమిద్దరుముచ్చటెచ్చుగలాడగ మాము చ్చటలుజూతువే యేమో నాపుణ్యమెట్టిదోకాని యాయింపుముఖియు నాకీమేటికియబ్బెనే ॥ అ ॥ తల్లినాకై నీవెళ్లియాచానను తమిదీరగూర్పితి వేతల్లినీరుణముధరదీర్చుటెన్నడో యెల్లజన్మములానీయుధరమందేజనిం తు ॥అ॥ తిరుపతిశ్రీనరహరియుండగ మరిభీతిల్లగయేలనే కరుణచే నిపు డు కాగల్లకార్యము లరయగ దెల్పిన నారీతిచేతునే ॥ అ ॥

వ॥ అమ్మా నేను పెండ్లిపెత్తనంబుచేసిరమ్మంటిని అదేప్రకారం నీవు మాట్లాడివచ్చినావు యిప్పుడు చేతపైకములేదుగాన దేవాదిదేవతులు వస్తారుగాన యెట్లనేతల్లి.

దరువు - పున్నాగ - ఆట.

యెట్లనేతల్లియెట్లనే యీయోచనకు ॥యిం॥ యెట్లనేయింకేమి యీపరదేశిపెండ్లికి దేవతులు మరి యెట్లవచ్చుట వీరలకునే విందుయేమనిపెట్టుదును॥యిం॥చేతపైకములేక మరిప్రఖ్యాతిగా యీనాతికొరకు నీతిమాలియు రాజుకడకును నిన్నుబొమ్మని యేలబంపితి ॥యె॥ యింత నిర్భాగ్యుడనటంచును యిత్తుకో యీకుంచురో మరిదంతిగమనరొయెంచిచూడగ తగిలిమరియుగిలించుటాయెనె॥యె॥ యెవరివేడుదు యెవరి బిలుతును యెవరితో నేమనగనేరనె యెవరునిదిపూనుదురో తిరుపతినేలుహరిదయ యెట్టులున్నదో ॥ యె ॥

గీ॥ యోచనెరుగక జేశితిరాచపట్టి యేలమోహింప నిన్నంపుటేల। పుట్టలోనిపాముగయుండగపూనినట్టి పనికియేమని వగతునేపద్మనేత్రీ॥

వకుళ॥ గీ॥ యేమి నాతండ్రి నావరాస్వామిజేరి విన్నవించినపైకంబు వేట్క-నొసగు।యిందుకై చింతయేలను యిందిరేశమదినిదుఖంబు మానురమావినోదా॥

వ॥ నాయనా నీకు యింతదుఖముయేలను నేనుపోయివరాస్వామిని పైకమడిగితీసుకొని వస్తానుతండ్రీ.

వ॥ ఆలాగేపోయి రావమ్మాతల్లీ.

సంది॥ యీప్రకారంబున వకుళస్వామివద్ద శెలవుతీసుకొని వరాహస్వామిచెంతజేరి యిట్లనియె.

వ॥ గీ॥ వందనంబులుకిటిదేవ వడిగలక్ష్మి బాసిపోయినపద్మజౌపణతినిపుడు పెండ్లియాడగదలచెనాప్రియసుతుండుకదశిపెండ్లాడగాను పైకంబులేదు॥

వ॥ హేస్వామి నాకొమారుండు ఆకాశరాజుకూతురైన పద్మావతిని పెండ్లాడవలెనని తలంచినాడుగాన యిప్పుడు పైకములేక చింతచేస్తున్నాడుగాన తాము పైకము యిప్పించండిస్వామి.

వ॥ హేవకుళా అతను యెవ్వరని తలంచినావు అతను నీబిడ్డ అనిఅనుకొన్నావా సాక్షాత్ శ్రీవైకుంఠాదిపతిగాన వారు తలచినకార్యమునకు యేమియొక్కకొరతగాను వారియొక్క వివాహమహోత్సవకాలమునకు దేవాదిదేవతులువచ్చి ఆకార్యమును వనగూర్తురు నీవు చూస్తుయుండుహూవకుళా.

వకు॥ హేస్వామి నాయొక్కకొమారుడు పెండ్లికితాముున్ను భూదేవిన్ని దయచేయవలయునుస్వామీ.

వ॥ హేవకుళా యీసంవత్సరం యీపర్వతమున సశ్యాదులు ఫలించి వృక్షంబులు కాచిపూచి మహోన్నతముగా వుంటూయున్నది కాబట్టి నీవు మామారుగాపోయి ఆయొక్కశ్రీనివాసమూర్తికి వివాహమహోత్సవము జరుపుకొనిరావే వకుళా.

సంధి॥ యీప్రకారం వకుళ స్వామిచెంత జేరినతదనంతరంబున స్వామి గరుత్మంతుని మనంబునందలంచి నంతలోనే గరుడు వచ్చినదిజూచి స్వామి యిట్లనియె.

గీ॥ గరుడనీవుపోయి కంజసంబవునకు లిఖితమిచ్చినైజ నిఖిల బంధు। సహితముగ కుటుంబ సంగంబుతోవచ్చి చెలగినాకుపెండ్లిచేయుమనుమీ॥

వ॥ స్వామిశేషునితో యిట్లనియె.

గీ॥ పొమ్మనియావిహగేంద్రుని సమ్మతిగా బనిచిశేష సర్వనిబిలుర్వ।బొమ్మ కుటుంబయుతముగ రమ్మనునాపెండ్లిజూడ రయమున శివునిన్॥

సంధి॥ యీప్రకారంబున స్వామి దేవాది దేవతులకు జాబులు రాశి పంపించినంతట దేవాదిదేవతులు వచ్చేటి విధంబెటువలెనూ.

బ్రంహేంద్రాదులుదర్వు -మధ్యమావతి -ఆది॥

శేషాద్రికరుగుదెంచిరపుడు బ్రంహాదిసురులు ॥ శే ॥ శేషాద్రినిమరి చెలగుచు నుండెడి శేషశాయిమది చింతనజేయుచు ॥ శే ॥ భేరిమ్రోయనం భోరుహముసతుంబూరనారదుల్ తంబురలనుతా॥ శే ॥ మదనుడురవిశశిమాపతిబృంగియు మదవతులగుశ్యామల శశలజుసతి॥

శే ॥ పంతమునను బలే హరిపరిణయమని సంతసమునకడు సంభ్రమ మొప్పగ ॥ శే ॥

సంది॥ యిట్లువచ్చిన దైవబృందంబులు హరికి నమస్కరించి నంతహరియును ఆశీర్వదించి వవ్వారి క్షేమంబులు విచారించి వారలకొక్కనెలవులంజూపి వారిని నిలువంజేశి నంతలో కమలాసనుండు హరితోయిట్లనియె.

బ్ర॥ వ॥ హేతండ్రీ యిట్లావ్వారకుండుట మంచిదాలగ్నంమించపచ్చె వేగమున మీరు అభ్యంగనము చేయండిస్వామీ.

సంది॥ అని బ్రంహ్మదేవుండు దెలుపగా విని హరి సురునతో లక్ష్మినిదలంచి యిట్లనియె.

ముఖారి-ఆట.

సురులార మీరలు మెరుగుదెంచియునాడు తెరగెరుగలేరైతిరే॥ సు ॥ వచ్చువారలు నన్నువరుసతో జేరి యాలక్ష్మి యేదనరైతిరే ॥సు॥ మెంరుకుపరిణయ మిందువదనమరి యందేగననరైతిరే ॥ సురు ॥ వినుము బ్రంహ్మదేవ వినుమయ్యా ధనుజారి వినుమయ్యా శాంబమూర్తి॥ సు ॥ మీరైనయడుగలేరైరే నాదుఖఃముచేరి నాకెరుకాయెగా ॥ సు ॥ నారాయతిరుపతి సరహరిరాముడు నారినెప్పుడుగూర్చునో సురులారా॥

గీ॥ యిందిరనుబాసి ఒంటిగా యిట్టికార్యమేను జేసిన నలుగును గానయింతి రాకయున్నను పెండ్లియు నాకువలదు యూపెయటురాగ నేపెండ్లి యాడగలను.

వ॥ అని స్వామిచెప్పిన తదనంతరంబున బ్రంహ్మదేవుండు సూర్యుని పిలచి యిట్లనియె.

బ్ర॥ హేరవిదేవ నీవు కొల్లాపురికి యరిగి మాతల్లిఅయిన లక్ష్మిదేవమ్మతో శ్రీనివాసమూర్తి వివాహము చేసుకోపోతాడుగాన అగత్యముగా రావలసినది అని చెప్పిపిలుచుకొనిరావయ్యా.

సంది॥ అని బ్రంహ్మదేవుడు చెప్పినమాట స్వామివినిరవికిట్లనియె.

స్వా॥ వ॥ హేరవిదేవ ఆకమలాసనుడు చెప్పినట్లు చెప్పితే లక్ష్మిరాదుగాన యిప్పుడు నేనుచెప్పినట్లుచెప్పు రవిదేవా.

గీ॥ రవిమహాదేవ కొల్లాపురంబు జేరి।యిందిరనుగాంచి నీపతి యి ప్పుడో యెప్పుడో । యిటులనున్నాడు గ్రక్కున నటకునీవు। రమ్మి రమ్మంచు బిలచియు రమ్మి వేగ॥

వ॥ ఆలాగే పోయివచ్చెదనయ్యాస్వామీ.

సంది॥ యీప్రకారంబున రవిదేవుండు కొల్లాపురమున కరిగి లక్ష్మితోయిట్లనియె.

సూర్యదరువు-పున్నాగ-ఆట.

రావమ్మ తల్లి॥రా॥ రావమ్మ తల్లి నీరమణుచందముజూడ లేవమ్మ వేగామె లేచినా వెంటను॥రా॥ యిప్పుడో యెప్పుడో యేమిజెప్పగజాల గొప్పవ్యాధిచె చాలగుందెడు నీబతి॥రా॥ తిరుపతిహరికరుణ నరయనెట్లున్నదో పరువడిపోదాముపదవమ్మ నావెంట॥రా॥

వ॥ అనినలక్ష్మి హానాథా భూమిమీదపడిలేచి యిట్లనియె.

లక్ష్మిదరువు- పున్నాగ-ఆది.

యెటువంటిమాటవింటిప్రాణేశా నిన్నుయెటువలె జూతునయ్యా ప్రాణేశా నిన్నునన్నుబాప ప్రాణేశా బృగుడుయిన్నిబంగులుజేశి ప్రాణేశా తెలివిమాలియునిన్ను ప్రాణేశా బహుతెగువతోశపియించినానే ప్రాణేశా కొల్లగసతులుగూడిప్రాణేశా నిన్ను రాళ్లచేరువ్విరేమోప్రాణేశా గొల్లవాడరుదెంచి ప్రాణేశా నిన్నుగొడ్డలిచేవేశనేమోప్రాణేశా ఆదెబ్బకోర్వలేకప్రాణేశా మరి యేమనుచువిలపించినావొప్రాణేశా తిరుపతిపురనివాసా ప్రాణేశా నిన్నేతీరున గందునయ్యా ప్రాణేశా॥

వ॥ అని పలువిధంబుల.

అయ్యో -దరువు-ఆట.

అయ్యయ్యోనాద యేమందుయికమీద అయ్యయ్యోనాథ నేనన్నరీతిగనయ్యో అయ్యో అయ్యో అయ్యోనాథా ॥అ॥ నేశాపమిటులేల-నాచాతజెట్టితి నకటాయకటాశకటాసురహరి ॥ అ ॥ నన్నువిడచినబహుఖిన్నుడౌదువని యెన్నినన్నానన్నివిన్నావే ॥ అ ॥ తిరుపతిహరి నాపై కరుణమాలియున్నాడో లేడో కీడో తెలియదే.

సంది॥ యిట్లు విలపించి శేషాద్రిచేరిన లక్ష్మినిచూచి హరి యిట్లనియె.

స్వామి-ముఖారి-అట.

రాకే బంగరిబొమ్మ రావేముద్దులగుమ్మ రావేరాశశివదనా నీవే గినంతలోనే పుట్టజొరగనువేవేగ నెుకగొల్లడేశే గొడ్డలితోడ ॥ రా ॥ నాబాధకోర్వక నావరాహునివేడ యీబాలికామణి యింపుగనాకిచ్చె॥ రా॥యీతల్లి నాఘాత యింపునమాన్ప యీభూతలమున నొక్కపోలతి వ రించితి॥రా॥కోరిగగనరాజుకూతుకౌ పద్మజచేరి పెండ్లాడగచింతించి మ దిలోన ॥ రా ॥ వంటిగనుండ నావల్లకాకున్న వాల్గంటిరో యీరీతిగావిం చినాడనే ॥ రా ॥ మదిలోనగినియకు వదలకు నీదయ నీమదిలోనగల య్యట్టి మరి జేతుతప్పనే ॥ రా ॥ నిన్నిందురప్పింప నిజముగరవిదేవు డ న్న చొప్పున నిన్నే ననుమానిబంచితి॥రా॥ యిద్దరుచేరిబల్ వద్దికతోడ నక ముద్దులాడుచునుండ ముచ్చటగాంతునే॥రా॥ పొలతియులేకున్న పు రుష జన్మంబేల నెలతరొయరుగవెనేదెల్పవలెనకె ॥రా॥ తిరుపతిరాము లకరుణలేకనుబాసి తరిలిననేమందుతరలాక్షివినగదే ॥ రా ॥

వ॥ అనిన లక్ష్మి.

సీ॥ పెండ్లియాడెటివాడు పెండ్లాడవలెగాని వగలుబల్కుటనీకు తగదుతగదు। నేనలగిపోయిననాడు అందిచూడగలేక యీనాటికేలనన్ని టులబిల్వ। తలవంచుటేలనెుతలమెత్తినీకును నాకునుకాదనినయముతో డ।సురులువినంగను సొంపుతోదెలిపిన నేబోదునాజాడనెమ్మితోడ దాని పెండ్లాడిగూడుచుదానిముద్దులాడ।లోకులుమెత్తురీయవనిలోన కొత్తనీ ళ్లొచ్చి పాతనీళ్లెత్తుబోవు సామతిగజేశినావు శేషాద్రివాన॥

వ॥ అనిన స్వామి చెయిపట్టుకొని లక్ష్మి.

నాదనామక్రియ - అట.

విడువిడువయ్యామహానుభావ॥వి॥ విడువిడుమయ్యాయీచిడుముడి బడువేళ దుడుకుతనంబునవడిగబట్టకుచెయ్యి॥వి॥నేబోవుతరిమరినినుదూ రుచందాన పూనిగొడ్డలితోడబొందగజేశెగ ॥వి॥ తబ్బిబ్బుపడరాళ్లదెబ్బ లుతగిలియే నిబ్బరమునులేకనీవుదలచుముమదిలో ॥ వి ॥ లోకములో పలయేకసతియులెస్స జోకతోనిద్దరుజోడుగూడినపోగు ॥ వి ॥ నీకొచ్చె యీాపదల్ నేనటులేకున్న యీకోర్కెలిటుజేయయింకేమిగలుగును ॥వి॥ యుల్లములరగనేనుకొల్లాపురముజేరి నల్లానితిరుపతినరహరినిదలతుపో॥

వ॥ అనిన స్వామి.

గీ॥ నీవు నను బాసిపోయిననిన్ను రేయి పగలు దలచుచునుంటినా పగయుమాని। పూనిపనులన్ని జేయుమాపొందుగాను నిన్ను యేలిక యుంచు నేనీరజాక్షి॥

గీ॥ నీవె నిజభార్య నాకును నీదుకరుణ దప్పినటయుందునటవే యీధాత్రిలోన।నీవెనాధనధాన్యంబునీవెబలము నీవెనాసొంపునాతెంపు నీలవేణి॥

వ॥ నీవే అన్ని అనియు నేనుండగా నీవు యిట్లామాట్లాడడంధ ర్మమాసఖి.

లక్ష్మి॥ వ॥ హేస్వామి నేను యెంతజెప్పినను వినక యుండడంపి ల్లాటలుగాయున్నదేస్వామి॥ అని

లక్ష్మి దర్వు-మధ్యమావతి-ఆదితాళం.

పిల్లాటలాసామిచెల్లాటలా నాతో యల్లాజనులుచూడకొల్లాగనా చెయ్యిమెల్లాగబట్టేవు మీాటేవు నీటేవు ॥పి॥ హెచ్చుగనాతోవట్టిగచ్చు లుజేశేవుతెచ్చునలాడకు తాళరయీావేళ॥పి॥ వగలుమాటలునాతో తెగువ తో బలికేవు మగతనమెల్ల దెలిశెమరిమరి నాతో॥పి॥ వెరపించివైరచేటి వెలదిని నేగాను మురిపెమునను నాతో ముచ్చటలాడగ॥పి॥ తిరుపతి పురహరి స్థిరముగ దలచియుంను కరుణతోడుత చెయ్యి కదియబట్ట కపోపొ ॥ పి ॥

వ॥ అనియు కమలాసనుంజేరి యిట్లనియె.

స్వా॥ హేకమలాసనా నేను పెండ్లిచేసుకోవడం లక్ష్మికియిష్టము లేదు కాబట్టి మీారు మీాస్థానమునకు పొన్నండి నాకేమిటికయ్యా వివాహం.

వ॥ తనిన లక్ష్మినిజూచి కమలాసనుండు హేతల్లీ నీవు యిక్కడికి వచ్చి స్వామికివివాహం చేయకుండా పోయినందున అది బాగాలేదుగా వున నీవు యిప్పుడు సంపంగినూనెచే తలఅంటవమ్మా అనిన సమ్మతించి.

లక్ష్మిస్వామికి-తలఅంటడం- రెగుప్తి-ఆది.

సంపంగినూనేలంటరమ్మ శ్రీహరికియిప్పుడు ॥ సం ॥ చంపకగం ధులు చయ్యనగూడుక సొంపుగమరిహరి సుందరునకును ॥ సం ॥ తేజ

ముగను మహారాజై యీభువిభోజుడనై సొంపుగదనరుముయని ॥సం॥ తిరుపతిపురనర హరిదయచేతను శిరులుగుల్కగను చేరియుండుమని॥ సంపంగినూనెలంటరమ్మా ॥

స్వా॥ వ॥ హేకమలాసనా యిప్పుడులక్ష్మినికూడా స్నానముచేయమనుకమలాసన.

వ ॥అనిన కమలాసనుండు లక్ష్మితో యిట్లనియె.

సంది॥ హేతల్లి మీరున్న అభ్యంగస్నానము చేయమనిమాతండ్రి చెప్పుతున్నాడుగాన స్నానముచేయవమ్మా.

వ॥ అనిన బ్రహ్మనుజూచి లక్ష్మి యిట్లనియె.

నాదనామక్రియ- ఆట.

నాకేలనయ్యా అభ్యంజనము॥నా॥నాకేలనయ్యయ్యా నళినగర్భుడ యిపుడు జోకతొపద్మజసుందరియుండగ ॥నా॥ ఆతడీవగలుమాటలు బల్కుచుండాన యీతీరుబల్కనేనెరుగానె యీమాయ ॥నా॥ తనుతప్పెంచరు తరుణులపైచాల క్రమమీరిమరియిట్ట క్రోమమునదూరేరు॥నా॥ అయినకానిమ్ము తిరుపతిశౌరిదయయున్న వరులపైదూరిన వగవేలనింకను ॥ నాకేలనయ్యా ॥

గీ॥ వినుము కమలాసనా నీతొవిన్నవింతు పద్మజయనుండనాకిట్టి పనులుదెల్ప! నేరనేజేయునేనెక్కతేరదాన గాననాజోలినీవింకమానుమయ్యా॥

వ॥ అనినలక్ష్మినిజూచి కమలాసనుండు హేతల్లియెందుకమ్మా యీపిచ్చి లేచిస్నానము శేయనమ్మా అనికుస్తరించిలక్ష్మి స్వామిఅబ్యంగస్నానముచేసినతదనంతరంబున స్వామిబ్రహ్మనుజూచి ప్రయాణభేరివేయించమనగా శివుడు విని దిగ్గునలేచి యిట్లనియె.

శి॥ వ॥ హేనారాయణమూర్తి యిదిమంచిపని యేమయ్యా దేవాదదేవతులు రుషులు యావన్మందివచ్చియున్నారుగాన యిక్కడవకపూట సంతర్పణచేయించి పోవలయునుస్వామి అనిన స్వామికుబేరునిపిలచి యిట్లనియె.

స్వా॥ సీ॥ ధనదావివాహప్రయత్నము నేనుజేసితిని నర్ధంబులేదిప్పుడబ్జసుతను।నాపెండ్లి కీవుధనంబిమ్మయనుటకు నాకుసంకోచమైనతిర

యముగ।నీవు ద్రవ్యము నిమ్మనే వడ్డిపత్రంబు వ్రాశియిచ్చెదనుసంవత్సర మునకు కొంకమాటువడ్డిసికొప్పించుచుండుదు కలియుగాంతమునని ష్కర్ష గాను। మొదలుదీర్చెదనీమాట మోసమనుచు దలచి వేదనవలదువిధాత యొకని। శంభునొకని లిఖితమందు సాక్షి జేశి వ్రాశియిచ్చెదనన దనపాలి యిపుడు॥

చంపకమాల॥ అజహరులారయీ కలియుగాంతము వచ్చెడుదాక। ధన్యమభుజగగిరీంద్రమందు పరిపూర్ణవిలాసములచ్చుతంబుగా।సుజనులకెల్ల మెచ్చగనుజూపివరంబులునిచ్చివిత్తముల్।నిజముగసంగ్రహించి యటునేను కుభేరున కప్పుదీర్చెదల్॥

తే॥ మీరు సాక్షిరులనిపల్కి బూరికనక।పత్రికప్పుడు దెప్పించిపంక్తులమర।దడయకప్పుడువ్రాశి విధాతచేతి।కిచ్చివచియింపుమనిన నజుండిట్లు చదివే॥

వ॥ హేకుభేరా నేను యీకలియుగమున వివాహం చేసుకోపోతున్నానుగాన నాకు కొంచము పైకము యిమ్ముకుభేరా.

కుబే॥ వ॥ అవశ్యంయిప్పిస్తుయున్నాను తీసుకోనుము మహాప్రభో.

స్వామికుభేరునకు - పత్రమువ్రాశి యివ్వడం.

సీ॥ శ్రీకరలీలస్వస్తి శ్రీవిజయాభ్యుద యస్త్రాదశద్వాపరాంతమందు। గలికలినాధి వెంకటనాయకుడు ధనపతికొసంగువడ్డిపత్రమెట్లు। ననిననుమావివాహమునకు నీచేతనప్పుగాగైకొనినట్టిరామ। టెంకినిష్కములుకోటియుంజతుర్దశలక్షలందుకు వడ్డిసహస్రినిష్కములను। బ్రతిసంవత్సరముదీర్చి మొన కలియుగాంతమున నేనుగైకొనినంతవిత్తమియ్యగలవారమజరుద్రలింపుకిపుడు సాక్షులశ్వద్థు లిచ్చుటసాక్షి నిజము॥

వ॥ హేబ్రంహ్మదేవ యీపైకము తీసుకొని పదార్థములుతయారుచేయించవయ్యా.

అనిన॥ బ్ర॥ హేతండ్రీ పదార్థములు యేవత్తుతయారు చేశినానుగాన పాత్రలులేదుస్వామీ.

వ॥ అనిన బ్రంహ్మనుజూచి.

సీ॥ పరదేశి పెండ్లికి పాత్రలెందుండు నిందమరుపుష్కరిణి దివ్యాన్నపాత్ర।పరశోభితంబైన పాపవిమోచనం శుద్ధమానటువంటి సూపపా

త్ర।విమలమౌనటువంటి యాకాశగంగ సదానందక పరమాన్నపాత్ర। గురుతరంబైనతుంబురుకోన చిత్రాన్నపాత్రశాకముల నేర్పరచి శేయ। బా త్రగనదేవతీర్థంబుబక్ష్యములను కోరిగావింపపాత్ర।కుమారదారి పచ్చడలుచేయుటకుపాత్ర పాండుతీర్థ మనుచుజెప్పుము హవ్యవాహానునికనఘా॥

సంది॥ యీప్రకారంబున స్వామిఅగ్నిదేవుడికి వుత్తరవుచేయఁగా ఆమేరకు అగ్నిదేవుడు వంటలు తయారుచేసిన తదనంతరంబున త్రింత్రిశ్యత్కోటిదేవతులు శ్రీశైలం వర్కు-బంతులు కూర్చుని భోజనంబులు జేశిరంత స్వామి ప్రయాణభేరివేయించి యావత్ దేవాదిదేవతులు శేషాద్రిడిగ్గి యోగుల మల్లవరమునకురాగా అంతఆకాశరాజు తనదండుదళమున వ్రెచ్చి దోడ్కొనిపోయి వారివారికి విడుదలం జూపించెనంత పద్మావతి స్వామివారినిదలంచి చెలులతోయిట్లనియె.

ముఖారి-ఆదితాళం.

రాజితాంగిరో శ్రీనివాసుడేడే లోకపూజ్యుడైనట్టి పుణ్యపురుషుడేడే ॥ రా ॥ భక్తులెల్లబ్రోచువాడె పణతులార పుణ్యశిష్టులపాలించువాడె చెలియలార అందముగనే నెపుడుజూతునె సుందరాంగి వానిపొందుగోరినానె ఓమంగళాంగి తిరుపతి శ్రీవెంకటేశుడె తరుణులారా వానికరుణయెపుడుగల్గునేవ్రొ కాంతులార॥

సంది॥ యీప్రకారంబున పద్మావతి స్వామివారిగుణములు తలంచుచుండగా ఆకాశరాజు చెలికత్తెలంజూచి యిట్లనియె.

ఆకా॥ వ॥ వోసఖ పద్మావతీదేవికి సకలభూషణాలంకృతంజేశి పెండ్లి సభామంటపంబునకుందోడ్కొని రండుచెలియా.

చె॥ వ॥ ఆలాగేస్వా .

సంది॥ వ॥ యీప్రకారంబున లక్ష్మిపద్మావతిశ్రీనివాసమూర్తి సహితంబుగా పెండ్లిపీఠంబుపై గూర్చుండ వశిష్టాదిమహానుభావులు వివాహమహోత్సవులం గావించిరంత భారతి పార్వతి గాయత్రి సావిత్రి అరుందతి మొదలైనముత్తైదువులందరు శుభముహూర్తంబున వారిశిరపద్మజులకు మంగళహారతులెత్తిరట యెటువలెను.

మంగళారతులు - సురటి - ఆట.

మంగళం మంగళం జయజయమంగళం॥మంగళమనిచెలులు ప్రేం

గుచు ఆరతులంగజజనక అలిమేల్ మంగకునూ॥మం॥యాబ్రుగుడటుదన్న యాలక్ష్మియలుగగ యాభూమిపతిసుత నేలేటిహరికి ॥ మం ॥ తిరుపతిహరికరుణ నరశిలక్ష్మినిపద్మ తరుణినిచేకొనిధర నేలుహరికి ॥ మంగ ॥

సం॥ వ॥ యిట్లు మంగళంబులుపాడి వధూవరులకు భూసురులచే నాశీర్వదింపంబడి హరిశిరపద్మావతులసంతోషంబునన్న వచ్చువారల కువర్సారి మరియాదలచేనంపి శ్రీనివాసుండు శేషాద్రిపై తనభార్యలం గూడితన్నుతలచుభక్తవరులకు తాముకోరువరంబునులొసంగుచుసంతోషంబుననుండిరని శౌనకాదులకుసూతుండుజెప్పిన వెంకటాచరమహాత్యంబునందు పద్మావతిపరిణయంబును నవరసంబులచేనున్న సప్తగతులచే నున్నయది సంపూర్ణము.

గద్య॥ యిది శ్రీరామచంద్ర పాదారవింద మకరందమధుపానమత్తుండును శ్రీవాస్తవ్య ఖరేచక్రపాణి చెంచుగోపాల్ దాసువారిపౌత్రుండును కాయస్తకుల సంభూతుండును కశ్యపిగోత్రోద్భవుండును కాశీరాం లాలాకుమారుండును సంగీతసాహిత్య నవరసలంకార ఘనతాళపాఠకవివరుండును శ్రీశారదాంభ వరప్రసాదకుండును నైన లాలాకన్నయ్యచే రచియింపంబడిన శ్రీవెంకటాచల మహాత్యంబునందు పద్మావతి పరణయంబను నాటకమును తిరుపతి హైరోడ్ మునిసీపల్ స్కూల్ హెడ్మాస్టర్ మునికుల గోత్రోద్భవుండును రాఘవశెట్టి ప్రథమపుత్రుండు ఆర్-నారాయణస్వామి సెట్టి వల్లనున్ను తిరుపతిపురవాసియగు చిట్టంజేరి కన్నియప్ప మొదలి పుత్రుండు రాజవేలు మొదలివల్లనున్ను యిరువర్ల ప్రేరేపనవల్ల యీనాటకమును ప్రచురమునకు తేబడినది.

ఈ నాటకము సంపూర్ణము.

S. V. N. PRESS, TIRUPATI, 1909.